ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త

# శ్రీ విశ్వదత్త వ్రతకల్పము





రూపకల్పన :

G. V. L. N. విద్యాసాగర శర్మ, M.A.

రిటైర్డ్ ప్రిన్సిపాల్

ప్రభుత్వ డిగ్రీ కళాశాల, గుంటూరు.

ప్రచురణ :

ఉప్పులూరి కనకదుర్గా సుబ్రహ్మణ్యం

ఛార్టర్డ్ అకౌంటెంటు

గుంటూరు

ప్రతులు : 1000

సర్వస్వామ్య సంకలితము

ముద్రణ :
సాయిరామ్ ప్రింటర్స్ & బైండర్స్
2/10 బ్రాడీపేట, గుంటూరు.

ప్రచురణ :
5 మార్చి 1992

ప్రచురణ కర్త :
ఉప్పలూరి కనకదుర్గా సుబ్రహ్మణ్యం
చార్టర్డ్ అకౌంటెంటు
గుంటూరు.



వెల : రూ. 10-00

ప్రతులు దొరుకు చోటు :
విశ్వమందిరము
కృష్ణనగర్, 3వ లైన్
గుంటూరు - 4

ఓం శ్రీ సాయి రామ్‌గురు దేవదత్త

# విశ్వ సందేశము

అన్ని జన్మలలోకి మానవజన్మ ఉత్తమమైనది. మానవ జన్మ లభించుటయే దుర్లభము. అదృష్టవశముగా దివ్యేపరముగా లభించిన మానవజన్మను మానవుడు సద్వినియోగము చేసుకొనుటకు సక్రమముగా యత్నించవలెను. మునుముందుగా మనిషిగా నిలచి, మనీషిగా మారి, మహాత్మునిగా, మహాశక్తి స్వరూపునిగా, సాక్షాత్తు మహేశ్వరునిగా మారటానికి దివ్య పథముపై పయనించాలి.

పరిపూర్ణ మానవత్వమే దివ్యత్వము. సనాతన ధర్మం మానవుని పరిపూర్ణ మానవునిగా తీర్చిదిద్దటానికి దోహద పడే మార్గం. ఇది ఒక ప్రాంతమునకో, మతమునకో సంబంధించినది కాదు. యావత్ మానవకళ్యాణమునకు, యావత్ మానవజాతి సమైక్యతకు, మన సనాతన ధర్మం ఎంతయో అవసరము, ఆచరణీయము అయియున్నది.

'వసుధైక కుటుంబము' అని చాటి చెప్పినది సనాతన ధర్మం. 'ఈశ్వరస్సర్వభూతానాం' అని ఎలుగెత్తి చెప్పినది సనాతన ధర్మం. 'ఏకంసత్, విప్రాః బహుధావదంతి' అని చెప్పింది సనాతన ధర్మం. 'మాతృదేవోభవ, పితృదేవోభవ ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ' అని మనిషి మనిషికి సందేశమిచ్చింది సనాతన ధర్మం. మనిషిని సంస్కరించి కుటుంబ వ్యవస్థను చక్కదిద్ది, గృహమును ప్రశాంతి నిలయముగా మార్చితద్వారా యావత్ మానవ సమాజమునుబక స్వర్గ ధామంగా, ఒక కలియుగ వైకుంఠంగా, ఒక ఆనంద నిలయముగా మార్చటానికి మార్గదర్శక మయింది.

అట్టి సనాతన ధర్మాన్ని విస్మరించి, కుటుంబమును విస్మరించి సమాజమును బాగుచేయాలని ప్రణాళికలు వేస్తున్నాము కాబట్టి అన్నిటిలోను అపజయమును రుచిచూచి ఇప్పుడు యావత్ ప్రపంచాన్ని ఒక అగ్నిగుండంగా, ఒక అశాంతి నిలయంగా దిగజార్చటానికి, నాగరికత పేర, విశృంఖల స్వాతంత్రత పేర, మితిమీరిన తెలివి తేటల పేర సహాయపడుతున్నాము. ఇది విచారించతగ్గ విషయం.

మొట్టమొదటిగా మనిషి సంస్కరించబడాలి. కుటుంబము సంస్కరించబడాలి. తరువాత సమాజము దానికదే సంస్కరించబడుతుంది. సంస్కారముగల వ్యక్తులతో విరాజిల్లే కుటుంబములను, గృహములను కలిగిన సమాజము ప్రశాంత పరిమళములను విరజిల్లుతూ ప్రకాశవంతంగా వెలుగొందుతుంది. విశ్వమానవ సమైక్యతతో సుసంఘటితంగా జీవిస్తూ విశ్వమానవకళ్యాణాన్ని రుచిచూస్తుంది. ఇదే, ఇదే ముక్కోటి దేవతల దివ్య సంకల్పం. ఇదే, ఇదే సమస్త యోగుల అవతారమూర్తుల, సిద్ధపురుషుల, మత ప్రవక్తల సంకల్పము, సందేశము. ఇదే, ఇదే సమస్త మానవ జాతి యొక్క ఆశ, ఆకాంక్ష, ఆశయము, లక్ష్యం.

విశ్వ మందిరం,
కృష్ణనగర్,
గుంటూరు.

దివ్య ఆశీస్సులతో
విశ్వయోగి విశ్వంజీ

# నివేదన

అజ్ఞానాంధ వివస్వంతం
బ్రహ్మ విష్ణు శివాత్మకం
ఆత్మానంద ప్రదం బుద్ధం
విశ్వ దత్తం సమామ్యహం.

ఈ శ్రీ విశ్వదత్తవ్రతకల్పము నా "గురుదత్త వైభవము"నకు అనుబంధ గ్రంథముగా గత దత్త జయంతి నాటికే, దానితోబాటు వెలువడవలసియున్నది. కాని ముద్రణకు సమయము చాలక పోవులచే అట్లు చేయుటకు వీలు పడినది కాదు. శ్రీ దత్తాత్రేయావతారులైన శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీవారి 48వ జన్మ దినోత్సవ సందర్భమున, పూజా ప్రసూనముగా ఈ గ్రంథమును వారి పాద పద్మములకు సమర్పించుకొను మహాభాగ్యము నేడు కలిగినది. ఇది నా పూర్వజన్మ సుకృతముగా భావించుచున్నాను.

సత్య దత్త వ్రతము, సాయినాథ వ్రతము మొదలైనవానివలె దత్త స్వరూపులైన శ్రీ విశ్వయోగి విశ్వంజీ వారి చరిత్రతో శ్రీ విశ్వదత్త వ్రతము నెవరైనను రూపొందించిన బాగుండునని చాలా రోజులనుండి తలచుచుండెడివాడను. ఆ కోరిక దత్తోపాసకులు, విద్వత్కవులునైనపూజ్య శ్రీ విద్యాసాగరశర్మగారి దయ వలన ఈనాడిట్లు నెరవేరినది. శ్రీచిరంజీవి గారు లోగడ సంకలితము చేసి, ముద్రించిన శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ సద్గురు పూజా విధానము ననుసరించి, వ్రత కథను స్వకపోలకల్పితముగా సంతరించి శ్రీ విద్యాసాగరశర్మగారు ఈ శ్రీ విశ్వదత్త వ్రత కల్పమును

భక్తాభీష్టప్రదముగా ఇట్లు రచించినాడు. ఈ వ్రతము విశ్వకుటుంబ సభ్యుల కెల్లరకు శ్రీ విశ్వయోగి విశ్వంజీ ప్రత్యక్ష దర్శనానుభూతిని కలిగించి, ఐహికాముష్మిక సౌఖ్యములను ప్రసాదించగలదని నా విశ్వాసము.

శ్రీ విశ్వదత్త వ్రతమును ఎవరైనను వారి వారి వీలు ననుసరించి, సత్యనారాయణస్వామి వ్రతమువలె పూజా ద్రవ్యములు సమకూర్చుకొని చేసుకొనవచ్చును. గురువారము, ఏకాదశి, పూర్ణిమ, గురుపాడ్యమి (మాఘ బహుళ పాడ్యమి) గురుద్వాదశి (ఆశ్వీజ బహుళ ద్వాదశి) మున్నగు పర్వ దినములలో ఈ వ్రతము చేసిన ఇతోధిక ఫలము లభించును. వ్రత కథ వినుట ద్వారా శ్రీ విశ్వయోగి విశ్వంజీ యెడల మనకు గల భక్తి శ్రద్ధలు ద్విగుణీకృతము కాగలవు. అందువలన గురు కటాక్షము శీఘ్రముగా, అనాయాసముగా మనము పొందగలము.

విశ్వమునకు దత్తమైన ప్రేమ స్వరూపులు శ్రీ విశ్వయోగి విశ్వంజీ సద్గురు దేవులు. ఆ విశ్వదత్త 48వ జన్మ దినత్సోవమునాడు ఈ గ్రంథము వెలువడుటకై దీక్ష వహించి, అహర్నిశలు శ్రమించిన మా చిరంజీవి లక్ష్మీనరసింహ సుధాకర్‌ను హృదయ పూర్వకముగా ఆశీర్వదిస్తున్నాను. తమ పరిపూర్ణానుగ్రహము వానిపై వర్షించగలందులకు శ్రీ విశ్వదత్తను ప్రార్థిస్తున్నాను.

సర్వాంగ సుందరముగా, సకాలములో, నిర్దుష్టముగా ఈ గ్రంథమును ముద్రించి యిచ్చిన శ్రీ సాయిరామ్ ప్రింటర్స్ అధినేత శ్రీ నడింపల్లి సాయిగారికి కృతజ్ఞతాభి వందనములు సమర్పిస్తున్నాను.

ఈ గ్రంథము కల్పవృక్షమై భక్తుల కామితముల నీడేర్చగలదని ఆశిస్తున్నాను. భక్త మహాశయులీ వ్రతమును తమ తమ గృహములలో ఆచరించి శ్రీ విశ్వదత్త కృపకు పాత్రులు కాగలరని మనవి.

ఓం శ్రీం విశ్వదత్తాయనమః

ఇట్లు

శ్రీ విశ్వదత్త పాద భక్త పరమాణువు

ఉప్పలూరి కనకదుర్గా సుబ్రహ్మణ్యము

ఛార్టర్డ్ అకౌంటెంటు.

గుంటూరు

5-3-92.

# పుష్పాంజలి

నీదు బొజ్జ నుండె నిఖిలమౌ విశ్వమ్ము
విశ్వమందిరాన వెలయు దీవు !
విశ్వమునకు నీకు భేదమ్ము లేదయ్యా !
విశ్వయోగివర్య ! వినతులయ్య !

అత్రితపంబు మెచ్చుకొని అమ్మునినాథున కీవు దత్తమై
పుత్రుడ వైతివంట ! - అతి పూర్వము - ముద్దులు మూటగట్టు నీ
చిత్రవిచిత్ర శైశవ విచేష్టితముల్ కనుగొంచు నెల్లరున్
చిత్రము లట్లు నిల్చిరటె ! చేతులు మోడ్చుచు భక్తియుక్తులై

ఉయ్యెలందున నిన్ను బజ్జుండ బెట్టి
అమ్మ లాలిపాటలు పాడు నవసరమున,
కొంటె నవ్వుతో కేరింత గొట్టు నిన్ను
గాంచి ప్రకృతి యెంత పరవశించినదియొ !!

అపుడు ధర్మ రక్షణకుగా నవతరించి
దత్తమైనావు నీ వత్రి దంపతులకు;
నవ సమాజ నిర్మాణమ్ము నవధరించి
"విశ్వదత్త" వైతివి నేడు విశ్వనాథ !

గురుదేవా ! నిను పుత్రరత్నముగ కన్గో నెంచి ఆ శ్రీయుతుల్
వరలక్ష్మమ్మయు నాంజనేయులును సంభావింప తొల్ బామునన్
కర మర్థిన్ తప మెంత సల్పిరో ? జగత్కల్యాణకాంక్షన్ వసుం
ధరపై క్రమ్మర నుద్భవించితివి - దత్తాత్రేయ దివ్యాంశతో !

ఆదిని శ్రీపిఠాపురమునందు జనించి యశమ్ము గొన్న శ్రీ
పాదులుగా - పదంపడి భవాల నృసింహ సరస్వతీ యతీం
ద్రాదులుగా - అనేక అవతారము లెత్తిన దత్తమూర్తి వీ
వాదని తేలిపోయె; ఇక అపుడు ! దాగుడుమూతలో ప్రభూ !!

ఎందరు లేరు యోగులు, మునీశ్వరు లీ జగమందు ? వా
రందరు ముక్కు మూసికొని, ఆ పరమాత్మను స్వార్థబుద్ధితో
పొందగ - సర్వమున్ వదలి పోవగ - నెంతురెగాని, నీవలెన్
పొందిన శక్తి యుక్తులను భూతహితమ్ముగ పెచ్చ నెంతురే ??

ప్రియమున్ శ్రేయము గల్గ నిచ్చితివి "ఓం శ్రీసాయిరాం" మంత్రమున్
దయ తోడన్ "గురు దేవదత్త" ననుసంధానించి భక్తాళికిన్;
నియమం బూని జపించు వారలకు శాన్తించెన్ మనక్షోభముల్;
భయముల్ వీడెను; నీవు కల్గ గురుదేవా ! లోటు వాటిల్లునే ?

"దేహమే పరికింప దేవాలయ" మ్మను
వేదవాణిని వినిపించినావు;
"దయగల హృదయమే దైవపీఠ" మ టన్న
భక్తి సూత్రము పట్టు బట్టినావు;
"జగతి నంతట నిండు శక్తి యే వ్యక్తిలో
నిలువెల్ల కల" దని తెలిపినావు;
"అదుపు - పొదుపు" రెంటి అవసరాలను చాటి
గృహ సంస్కరణము కాంక్షించినావు;

"జగము, బ్రహ్మము" రెండును సత్య మనుచు,
"భౌతికమ్మును కాదన వల" దటంచు,
మనిషిని "మనీషి"గా దిద్దు మహిత కార్య
దీక్ష గొన్నావు — శ్రీ గురుదేవ ! - నీవు !!

బ్రహ్మ విష్ణు శివస్వరూపంబు నీవు !
పరము నిర్గుణ శుద్ధ తత్త్వంబు నీవు !
సర్వ జగముల నేలు చిచ్ఛక్తి వీవు !
"విశ్వదత్త"వు నీవు ! మా వెలుగు నీవు !!

జపములు, తపములు సలుప నక్కరలేదు
నిన్నెడంద తలంచుకొన్న చాలు -
పుణ్యతీర్థాలలో మునుగ నక్కరలేదు
నీ పదాంబుజము లంటినను చాలు -
శాస్త్రమ్ము లేవియు చదువ నక్కరలేదు
నీ శుభాశీస్సు లందినను చాలు -
వేలుపు తరువును వేడ నక్కర లేదు
నీ మోవి నొలుకు వెన్నెలలు చాలు -

అలయ నక్కరలేదు భయమ్ము నొరసి
గురువరా ! నీవు మము కనుగొన్న చాలు -
నీదు సన్నిధే మాకు పెన్నిధి గదయ్య !
అందుకోవయ్య ! హృదయ పుష్పాంజలులను !!

— విద్యాసాగరశర్మ

ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త

# శ్రీ విశ్వదత్త పూజా విధానము

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ విఘ్నోప శాంతయే.
(పిమ్మట మూడుసార్లు ఆచమనము చేయవలెను.)

ఓం కేశవాయస్వాహా, ఓం నారాయణాయస్వాహా, ఓం మాధవాయ స్వాహా, గోవిందాయనమః, విష్ణవేనమః, మధుసూదనాయనమః, త్రివిక్రమాయనమః, వామనాయనమః, శ్రీధరాయనమః. హృషీకేశాయనమః, పద్మనాభాయనమః, దామోదరాయనమః, సంకర్షణాయనమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయనమః, అనిరుద్దాయనమః, పురుషోత్తమాయనమః, అధోక్షజాయనమః, నారసింహాయనమః, అచ్యుతాయనమః. జనార్ధనాయ నమః, ఉపేంద్రాయనమః, హరయేనమః, శ్రీకృష్ణాయనమః.

ప్రాణాయామము :

ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్, ఓం ఆపోజ్యోతిరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్.

ఘంటారవము :

ఆగమార్థంతు దేవానాం, గమనార్థంతు రక్షసామ్ । కురు ఘంటా రవం తత్ర దేవతాహ్వాన లాంఛనమ్.

(దీపము వెలిగించవలెను.)

సంకల్పము :

మమోపాత్త సమస్త దురిత క్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభేశోభనే, అభ్యుదయ ముహూర్తే, శ్రీ మహావిష్ణోరాజ్ఞాయా ప్రవర్త

మానస్య, ఆద్యబ్రహ్మణః ద్వితీయ పరార్ధే, శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రధమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరత ఖండే. మేరోర్దక్షిణ దిగ్భాగే, శ్రీ శైలస్య ఈశాన్య ప్రదేశే, గంగా కావేర్యోః మధ్యప్రదేశే, శోభనగృహే, సమస్త దేవతా బ్రాహ్మణ హరి హర గురుచరణ సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమా నేన .... సంవత్సరే .... ఆయనే .... ఋతౌ .... మాసే .... పక్షే.... తిధౌ .... వాసరౌ, శుభనక్షత్రే శుభయోగే శుభకరణే ఏవంగుణ విశే షణ విశిష్టాయాం శుభతిధౌ, శ్రీమాన్ .... గోత్ర. .... నామధేయః ధర్మ పత్నీ సమేతః శ్రీమతః .... గోత్రస్య .... నామధేయస్య, ధర్మపత్నీ సమేతస్య, మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శ్రీ విశ్వదత్త దేవతా ముద్దిశ్య శ్రీ విశ్వదత్త ప్రసాద సిద్ధ్యర్థం, శ్రీ సమర్థ సద్గురు విశ్వదత్త వ్రత పూజా మహంకరిష్యే (నీటిని ఉంగరపు వ్రేలితో తాకవలెను).

ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే – తదంగకలశారాధనం కరిష్యే (నీటిని తాకవలెను) కలశం గంధ పుష్పాక్షతైరభ్యర్చ్య – (కలశమును గంధపుష్పాక్షతలతో నలం కరించి ఈక్రింది విధముగా చెప్పవలెను).

కలశస్యముఖే విష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితాః । మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృ గణాస్మృతాః । కుక్షౌతు సాగరాస్సర్వే సప్త ద్వీపా వసుంధరా । ఋగ్వేదో౽థ యజుర్వేద స్సామవేదో హ్యధర్వణః । అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః । గంగేచయమునే కృష్ణే గోదావరి సరస్వతి । నర్మదే సింధు కావేరి జలే౽స్మిన్ సన్నిధిం కురు । ఆయాంతు శ్రీ మహాగణాధిపతి పూజార్థం మమదురిత క్షయ కారకాః । కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య। దేవ మాత్మానం చ సంప్రోక్ష్య ।

[కలశోదకమును పూజాద్రవ్యములపైనను చల్లుకొనవలెను. పసుపుతో జేసిన వినాయకుని తమలపాకుతో తాకి ఈ విధముగా చెప్పవలెను].

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః స్థిరోభవ । వరదోభవ । సుముఖోభవ । సుప్రసన్నోభవ । స్థిరాసనం కురు । మహాగణపతయే నమః ఆవాహయామి । మహాగణపతయే నమః ఆసనం సమర్పయామి । పాదయోః పాద్యం సమర్పయామి । హస్తయోః అర్ఘ్యం సమర్పయామి । ముఖే ఆచమనీయం సమర్పయామి । మహాగణపతయే నమః స్నానం సమర్పయామి । స్నానానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి । వస్త్ర యుగ్మం సమర్పయామి । యజ్ఞోపవీతం సమర్పయామి । గంధాన్ ధారయామి । గంధోపరి అక్షతాన్ సమర్పయామి । పుష్పైః పూజయామి.

ఓం సుముఖాయ నమః । ఓం ఏకదంతాయ నమః । ఓం కపిలాయ నమః । ఓం గజకర్ణకాయ నమః । ఓం లంబోదరాయ నమః । ఓం వికటాయ నమః । ఓం విఘ్నరాజాయ నమః । ఓం గణాధిపాయ నమః । ఓం ధూమకేతవే నమః । ఓం గణాధ్యక్షాయ నమః । ఓం ఫాలచంద్రాయ నమః । ఓం గజాననాయ నమః । ఓం వక్రతుండాయ నమః । ఓం శూర్పకర్ణాయ నమః । ఓం హేరంబాయ నమః । ఓం స్కందపూర్వజాయ నమః ఓం శ్రీ మహాగణాధిపతయే నమః నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి । ధూపమాఘ్రాపయామి । దీపందర్శయామి । ధూపదీపానంతరం ఆచమనీయం సమర్పయామి । నైవేద్యం సమర్పయామి (నైవేద్యముపై నీళ్ళు చల్లుచు చెప్పవలెను).

ఓం భూర్భువ స్సువః ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్యధీమహి ధియోయోనః ప్రచోదయాత్ సత్యం త్వర్తేన పరిషించామి । అమృతమస్తు । అమృతోపస్తరణమసి । ఓం ప్రాణాయ నమః । ఓం అపానాయ నమః । ఓం వ్యానాయ నమః । ఓం ఉదానాయ

నమః । ఓం సమానాయ నమః మధ్యే మధ్యే పానీయం సమర్పయామి ।
హస్తౌ ప్రక్షాళయామి పాదౌ ప్రక్షాళయామి । శుద్ధాచమనీయం సమర్పయామి ।
మహాగణాధిపతయే నమః తాంబూలం సమర్పయామి । కర్పూర నీరాజనం
సమర్పయామి । నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి । మంత్ర
పుష్పం సమర్పయామి । ఆత్మప్రదక్షిణ నమస్కారం సమర్పయామి ।
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప । యత్పూజితం మయా
దేవ । పరిపూర్ణం తదస్తుతే । అనయాధ్యాన ఆవాహనాది షోడశోపచార
పూజాయ చ భగవాన్ సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతి దేవతా సుప్రీతసు
ప్రసన్నో వరదో భవతు । ఏతత్ఫలం పరమేశ్వరార్పణమస్తు । మమ
శ్రీ గణాధిపతి దేవతా ప్రసాద సిద్ధిరస్తు [పూలు అక్షతలు శిరస్సుపై ఉంచు
కొనవలెను] శ్రీ మహాగణాధిపతయే నమః యథాస్థానం ఉద్వాసయామి
[దేవతను కొద్దిగా జరుపవలెను].

## అథ శ్రీ విశ్వదత్త పూజా సంకల్పం

ఆచమ్య ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం
మాధవాయ స్వాహా .... ఓం శ్రీ కృష్ణాయ నమః । ఉత్తిష్ఠంతు భూత
పిశాచాః ఏతే భూమి భారకాః ఏతేషాం అవిరోధేన బ్రహ్మకర్మ సమా
రభే ! ఓం భూః ఓం భువః .... భూర్భువస్సువరోం. మమ ఉపాత్త
సమస్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం .... మమ ధర్మ
పత్నీ సమేతస్య మమోపాత్త సమస్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర
ప్రీత్యర్థం క్షేమస్థైర్య విజయ అభయ ఆయురారోగ్యాభి వృద్ధ్యర్థం సర్వా
భీష్ట సిద్ధ్యర్థం శ్రీ విశ్వదత్త దేవతా ముద్దిశ్య విశ్వదత్త ప్రసాదసిద్ధ్యర్థం
శ్రీ సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్త వ్రత పూజాం మహం కరిష్యే (నీటిని
తాకవలెను) తదంగ కలశారాధనం కరిష్యే । కలశం గంధపుష్పాక్షతైర
భ్యర్చ్య । కలశస్య ముఖే విష్ణుః .... జలేఽస్మిన్ సన్నిధిం కురు.

ఆయాంతు శ్రీ విశ్వదత్త విశ్వయోగి విశ్వంజీ సద్గురు పూజార్థం మమ దురితక్షయ కారనాః । కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య 1 గురుదేవ మాత్మానం సంప్రోక్ష్య.

ఘంటానాదం :

ఆగమార్ధంతు దేవానాం, గమనార్ధంతు రక్షసామ్, కురు ఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంఛనమ్.

ధ్యానం :

జటాధరం పాండురంగం ప్రేమహస్తం కృపానిధిం
సర్వజాడ్యహరం వందే విశ్వదత్తం జగద్గురుం ॥
విశ్వంభరం విశ్వనాథం విశ్వాత్మం విశ్వతోముఖం
వరలక్ష్మీసుతం వందే విశ్వదత్తం జగద్గురుం ॥
అవధూతం మహాత్మానం యోగినం భక్తవత్సలం
ఆంజనేయాత్మజం వందే విశ్వదత్తం జగద్గురుం ॥
జ్ఞానమూలం జ్ఞానగమ్యం జ్ఞానవశ్యం భయాపహం
నిశ్శ్రేయసప్రదం వందే విశ్వదత్తం జగద్గురుం ॥
సత్స్వరూపం చిదానందం పరంజ్యోతిం పరాత్పరం
ఆత్మానందప్రదం వందే విశ్వదత్తం జగద్గురుం ॥

సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయనమః ధ్యానం సమర్పయామి.

ఆవాహన :

ఆవాహయామి సద్భక్త్యా నిత్యానందం మహామతిం సర్వధర్మపరం నిత్యం పూర్ణానందైక విగ్రహం । సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయ నమః ఆవాహనం సమర్పయామి.

ఆసనం :

నానామణి గణోపేతం నానారత్న విభూషితం స్వర్ణ సింహాసనం తుభ్యం దాస్యామి స్వీకురుగురో । సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయ నమః ఆసనం సమర్పయామి.

పాద్యం :

పాద్యం గృహాణభో యోగిన్ తీర్థపాద దయాకర శిష్యవత్సల సర్వజ్ఞ ఆశ్రితామరకల్పక । సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయ నమః పాద్యం సమర్పయామి.

అర్ఘ్యం :

అర్ఘ్యం దాస్యామ్యహం భక్త్యా తవహస్తే గురూత్తమః సంగృహీత్వా మహాభాగ కురు సంసార తారణమ్ , సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయ నమః అర్ఘ్యం సమర్పయామి.

ఆచమనీయం :

జ్ఞాన వైరాగ్య సంపన్న భవరోగైక భేషజ గృహాణ త్వం మయాదత్తం ఇదం ఆచమనీయకం । సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయ నమః ఆచమనీయం సమర్పయామి.

పంచామృత స్నానం :

పంచామృతం మయానీతం పయోదధి ఘృతం మధు శర్కరా సహితం చైవ సద్గురుస్త్వం గృహాణభో, సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయ నమః పంచామృత స్నానం సమర్పయామి.

శుద్ధోదక స్నానం :

గంగాది పుణ్యసలిలైః మయానీతైః శుభావహైః స్నాపయిష్యామ్యహం భక్త్యా ప్రసన్నో భవ సద్గురు । సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయ నమః శుద్ధోదక స్నానం సమర్పయామి.

వస్త్రయుగ్మం :

పీతాంబర మిదం స్వర్ణతంతునా నిర్మితం శుభం సోత్తరీయం సతాంబూలం వాసాంసి ప్రతిగృహ్యతాం । సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయ నమః వస్త్రయుగ్మం సమర్పయామి.

యజ్ఞోపవీతం :

తంతుం తన్వన్ మయా భక్త్యా బ్రహ్మసూత్రం వినిర్మితం దాస్యామి ధారణార్థం వైగృహాణ బ్రహ్మవిద్వర । సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయ నమః యజ్ఞోపవీతం సమర్పయామి.

గంధం :

గంధం చందనోన్మిశ్రం కర్పూరేణ సుసంయుతం విలేపనం గురుశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం । సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయ నమః గంధం సమర్పయామి.

అక్షతలు :

అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ హారిద్రా చూర్ణ మిశ్రితాన్ అర్పయిష్యామ్యహం భక్త్యా స్వీకుర్యానంద వర్ధన । సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయ నమః హారిద్రాక్షతాన్ సమర్పయామి.

వనమాల : మల్లికా కుంద మందార జాజీ పున్నాగ చంపకైః
గ్రధితాం మాలికాంతుభ్యం దాస్యామి స్వీకురుగురో
సమర్ప సద్గురు శ్రీ విశ్వదత్తాయనమః వనమాలాం సమర్పయామి
సర్దో సద్గురు శ్రీ విశ్వదత్తాయనమః పుష్పైఃమర్థ పూజయామి
శ్రీ విశ్వదత్త స్వరూప శ్రీ విశ్వయోగి విశ్వంజీ సద్గురు అష్టోత్తర
శతనామ పూజాం కరిష్యే (నీటిని తాకవలెను)

# అష్టోత్తర శతనామావళిః

ఓం శ్రీ గణపతయేనమః
ఓం శ్రీ గురవేనమః
ఓం అవధూతాయనమః
,, అనుగ్రహభాషిణేనమః
,, అనంతాయనమః
,, అక్షరాయనమః
,, అశోకాయనమః
,, ఆదర్శమూర్తయేనమః
,, కపయేనమః
,, కర్మయోగినేనమః 10
,, కరుణానిధయేనమః
,, చిరంజీవినేనమః
,, జటాధరాయనమః
,, త్యాగినేనమః
,, త్రిగుణాత్మకాయనమః
,, త్రికాలజ్ఞాయనమః
,, దయావతేనమః
,, దయాసారాయనమః
,, దయామూర్తయేనమః
,, దత్తప్రియాయనమః 20
,, దత్తాత్రేయస్వరూపాయనమః

ఓం దీనబాంధవాయనమః
,, దీన రక్షకాయనమః
,, ధార్మికాయనమః
,, ధ్యానగమ్యాయనమః
,, నాస్తికత్వ నివారకాయనమః
,, నిష్కళంకాయనమః
,, నిష్కోపాయనమః
,, నిర్వికారాయనమః
,, నిత్యబోధాయనమః 30
,, నిస్స్వార్థాయనమః
,, నిరాహారిణేనమః
,, నిరహంకారాయనమః
,, నిత్యానుష్ఠానతత్పరాయనమః
,, నిర్మలాయనమః
,, నీతిశాస్త్రప్రబోధకాయనమః
,, పరబ్రహ్మణేనమః
,, పండిత ప్రశంసితాయనమః
,, పుష్పమాలాధరాయనమః
,, ప్రసన్నాయనమః 40
,, పావనాయనమః
,, బ్రహ్మచారిణేనమః

ఓం బ్రాహ్మణాయనమః
,, బుద్ధాయనమః
,, భక్తవత్సలాయనమః
,, భక్తమార్గ ప్రబోధకాయనమః
,, భక్తజనసేవితాయనమః
,, భక్తిబంధవేనమః
,, భావాతీతాయనమః
,, భోగవివర్జితాయనమః 50
,, మంజుభాషిణేనమః
,, మృదుభాషిణేనమః
,, మితభాషిణేనమః
,, మునయేనమః
,, యోగినేనమః
,, యోగ్యాయనమః
,, యోగజ్ఞానప్రకాశనాయనమః
,, వరదాయనమః
,, విలక్షణాయనమః
,, వివేకవిదేనమః 60
,, విశాలాక్షాయనమః
,, విశ్వాయనమః
,, విశ్వభావనాయనమః
,, విశ్వనాథాయనమః
,, విశ్వయోగినేనమః
,, విశ్వమందిరవాసాయనమః
,, విశ్వవ్యాప్తినేనమః
,, విశ్వంభరాయనమః

ఓం విశ్వరూపిణేనమః
,, విశ్వగ్రాసాయనమః 70
,, విశ్వయోనయేనమః
,, విశ్వాత్మనేనమః
,, విశ్వమూర్తయేనమః
,, విశ్వరేతసేనమః
,, విశ్వకర్మణేనమః
,, విశ్వచక్షుషేనమః
,, విశ్వసాక్షిణేనమః
,, విశ్వబాహవేనమః
,, విశ్వరూపాయనమః
,, విశ్వేశ్వరాయనమః 80
,, విద్యావతేనమః
,, వేదప్రియాయనమః
,, వైద్యాయనమః
,, శాంతాయ నమః
,, శుభాయనమః
,, శిష్యవత్సలాయనమః
,, శిష్యహృచ్చోరాయనమః
,, శ్రేష్ఠాయనమః
,, శ్రేయోమార్గాయనమః

,, సమదర్శినేనమః 90
,, సర్వకళాప్రియాయనమః
,, సంకీర్తన ప్రియాయనమః
,, సదాచారాయనమః

ఓం సర్వజ్ఞాయనమః
ఓం సద్గురవేనమః
,, సదానందాయనమః
,, సత్యరూపిణేనమః
,, సత్యసంకల్పాయనమః
,, సత్యాయనమః
,, స్థితప్రజ్ఞాయనమః 100
,, సుందరాయనమః

ఓం సుజన ప్రియాయనమః
,, సర్వమంగళాయనమః
,, సుకృతాయనమః
,, సాత్వికాయనమః
,, సౌమ్యాయనమః
,, జ్ఞాన యోగినేనమః
,, జ్ఞాన గమ్యాయనమః 108
ఓం శ్రీం విశ్వదత్తాయనమః

విశ్వ దత్త స్వరూప శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ సద్గురుపరబ్రహ్మణేనమః
నానా విధ పరిమళ పత్ర పుష్పాణి సమర్పయామి

**ధూపం :**

వనస్పతి రసోద్భూతం సుగధం సుమనోహరం
ధూపమాఘ్రాణ భోయోగిన్ తవ శిష్యైః సమర్పితం
సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయనమః ధూపమాఘ్రాపయామి

**దీపం :**

సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినాయోజితం మయా
గృహాణ మంగళం దీపం త్రైలోక్యతిమిరాపహం
సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయ నమః దీపం దర్శయామి

**నైవేద్యం :**

గోక్షీరం శర్కరోపేతం ఏలాచూర్ణ సమన్వితం
ఫలానిచ సుపక్వాని స్వీకురు జ్ఞానదాయక

సమర్థ సద్గురు శ్రీ విశ్వ దత్తాయనమః నైవేద్యం సమర్పయామి.

(నైవేద్యం మీద నీళ్ళు చల్లి, చుట్టూ తిప్పవలెను.)

అమృతమస్తు! అమృతోప స్తరణమసి! (ఉద్దరిణతో నీటి నిచూపించి పళ్లెములో విడువలెను)

ఓం ప్రాణాయనమః, ఓం అపానాయనమః, ఓం వ్యానాయనమః, ఓం ఉదానాయనమః, ఓ సమా నాయనమః । మధ్యేమధ్యేపానీయం సమర్పయామి। హస్తౌ ప్రక్షాళయామి। పాదౌ ప్రక్షాళయామి। శుద్ధాచమనీయం సమర్పయామి.

**తాంబూలం :**

పూగీ ఫలసమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం
కర్పూర చూర్ణసంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం
సమర్ద సద్గురు శ్రీ విశ్వదత్తాయనమః తాంబూలం సమర్పయామి.

కర్పూర నీరాజనం :

మంగళం విశ్వదత్తాయ మహనీయ గుణాత్మనే
వరలక్ష్మీతనూజాయ యోగి రాజాయ మంగళం॥
మంగళం కల్పవృక్షాయ సచ్చిదానంద రూపిణే
మూర్తిత్రయ స్వరూపాయ అవధూతాయ మంగళం॥
మంగళం జ్ఞాన బోధాయ విశ్వమందిరవాసినే
జితేంద్రియాయ జ్ఞానాయ విశ్వనాథాయ మంగళం॥

సమర్ద సద్గురు శ్రీ విశ్వ దత్తాయనమః కర్పూర నీరాజనంసమర్పయామి
నీరాజనానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

నమస్కారము :

అజ్ఞానాంధ విపస్వతం బ్రహ్మ విష్ణు శివాత్మకం
ఆత్మానందప్రదం బుద్ధం విశ్వద త్తం నమామ్యహం.

సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయనమః నమస్కారాన్ సమర్పయామి

అథా కథా ప్రారంభః

# శ్రీ విశ్వదత్త వ్రతకథ

## ప్రథమాధ్యాయము

ఓం గంగం గణపతయేనమః

ఓం శ్రీం విశ్వ దత్తాయనమః; ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త

శ్రీ దత్తాత్రేయావతారులైన శ్రీ విశ్వయోగి విశ్వంజీ సద్గురు మహారాజ్ గుంటూరు-మదరాసు జాతీయ రహదారిపై, 16వ కి.మీ. దగ్గర గల 'విశ్వనగర్'లో, సనాతన ధర్మ పరిరక్షణకై 'విశ్వమానవ సమైక్యతాస్థూపము'నకు భారతదేశ మహోన్నత న్యాయస్థానము యొక్క ప్రధాన న్యాయాధిపతి గౌరవనీయులు శ్రీరంగనాథ మిశ్రాగారిచే శంఖుస్థాపన జరిపించిన తరువాత, వారికీర్తి ప్రతిష్టలు దేశదేశాంతరములకు వ్యాపించెను. పలువురు మేధావులు, యోగులు, సిద్ధపురుషులు, రాజకీయనాయకులు, అర్థార్థులు, ముముక్షువులు వారిదర్శనార్థము వచ్చుచుండిరి. ఆ యోగిరాజు తమపై వర్షించు ప్రేమామృతధారలకు పరితృప్తులై అభీష్ట సిద్ధినందుచుండిరి.

విశ్వయోగి దర్శనార్థము వచ్చిన ఒక సాధకుడు జిజ్ఞాసతో, స్వామి వారి పరిపూర్ణానుగ్రహమునకు పాత్రుడై, సర్వదా వారి సన్నిధిలో జీవితము వెళ్ళబుచ్చుకొనుచున్న విశ్వకుటుంబ సభ్యుడగు ఒక జ్ఞాన వృద్ధుని గాంచి, వినయ పూర్వకముగా నమస్కరించి'' స్వామీ! శ్రీ విశ్వయోగి విశ్వంజీ వారిని దర్శించవలెనను కుతూహలముతో చాలదూరము నుండి వచ్చితిని. వారి మహిమలు వినుటయేగాని వారిని గురించి నాకేమియు తెలియదు. దయచేసి వారి చరిత్ర తెలిపి ధన్యుని గావించు''దని ప్రార్థించెను.

అప్పుడా జ్ఞాన వృద్ధుడు సాధకునితో నిట్లను చున్నాడు. "నాయనా! నా ప్రియస్నేహితుని చరిత్రయే నాకు తెలియదు. నామనస్సేనాకు గోచరము కాకున్నది. ఇట్టి స్థితిలో యోగీశ్వరుని చరిత్రనే నెట్లు చెప్పగలను ? ఆ మహాత్ముని లక్షణము లిట్టివని నేనెట్లు వర్ణించగలను? యోగియైన వాడే యోగి యొక్క జీవితమును గ్రహించగలడు. అట్టిచో వారి మహిమ యిట్టిదని నేనెట్లు వాక్రువ్వగలను ? సప్తసముద్రముల లోతునైనను కనుగొనవచ్చును. గాని, నీటినైనను మూటగట్టవచ్చును. గాని, ఆకాశ పుష్పమునైనను సాధించ వచ్చునుగాని యోగీశ్వరుల చరిత్ర చెప్పుట దుస్తరము. నీవు గురుభక్తితో, శ్రద్ధాసక్తులతో, జిజ్ఞాసతో అడుగు చున్నావు. కావున విశ్వదత్త నాచే పలికించిన విధముగా చెప్పెదను. సావ ధానముగా వినుము.

విశ్వయోగి వారెవరోకాదు. సాక్షాత్తు విశ్వదత్త. ఆనాడు ధర్మ సంరక్షణార్థము పరబ్రహ్మ అవతరించి, అత్రి దంపతులకు దత్తమైనాడు. ఈనాడు ఆయన విశ్వమునకు దత్తమై, నవ సమాజ నిర్మాణమునవధరించి, ప్రతివ్యక్తిని అత్రిగా జేయుటకై దీక్షబూనినాడు. దత్తాత్రేయులవారు బ్రహ్మ విష్ణు, మహేశ్వరుల సమైక్యరూపము. భిన్నత్వములో నేకత్వము జూపి, "ఏకం సత్ విప్రాబహుధా వదంతి" యను సత్యమును చాటిచెప్పిన పర బ్రహ్మతత్త్వము దత్తాత్రేయుడు, "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"యని శ్రుతులు పలుకుచున్న జ్ఞాన గమ్యమైన పరతత్త్వము దత్తాత్రేయుడు.ఆయన జ్ఞాన ప్రదాత. కావుననే ఏ అవతారమూర్తికి లేని 'గురుదేవ' యున్న విశేషణమాయనకు కలిగి సార్థకమైనది. అన్ని అవతారముల లక్ష్యము, ధ్యేయము ఒక్కటేయైనను దత్తావతారము విలక్షణమైనది. ఏ ప్రయోజ నార్థ మవతారము వచ్చెనో ఆప్రయోజనము తీరిన తరువాత ఆ అవతారము లోకము నుండి నిష్క్రమించును. రామకృష్ణా ద్యవతారములన్నియు

నట్టివే! దత్తావతారము దుష్ట శిక్షణకుగాక, దుష్టులను జ్ఞానబోధచే శిష్టులుగా మార్చునుద్దేశముతో నేర్పడినదగుటచే భువిపై జనులున్నంత వరకు ఆ అవతార ప్రయోజనముండక తప్పదు. కనుక అది నిత్యసత్యావతారముగా పరిగణించబడినది.

నాయనా! దత్తాత్రేయులవారు అనసూయాత్రి పుత్రులనుట పురాణ గాథ. "ఇతిహాస పురాణాభ్యాం వేదాంతార్థ ప్రకాశ్యతే" యనునట్లుపురాణము లందలి కథలన్నియు వేదాంతార్థమును ప్రకటించు చుండును. ఆ కథలను కథలుగా గాక ఆ కథలలోని పరమార్థమును మనము గ్రహించవలెను. 'అత్రి' అనునది సాధకునికి ఒక సంకేతము. అత్రి అనగా మూడు కాని వాడు లేదా మూడు లేనివాడు. ఒక వ్యక్తి సాధనా క్రమములో సత్త్వర జస్తమో గుణముల కతీతమైన స్థితిని, స్థూల సూక్ష్మ కారణములనే మూడు పురములను (బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంధులను) విచ్ఛేదము చేయు స్థితిని, అసూయలేని మానసిక సాహచర్యముతో చేరుకున్నప్పుడు ఆతడు అత్రి యగును. అట్టివానికి సృష్టి స్థితిలయకారకమైన మహాశక్తి దత్తమగును. దత్తాత్రేయుడనుటలో గల అంతరార్థమిదియైయున్నది.

తనలోని దివ్యశక్తిని సర్వత్రా వ్యాపించి యున్న విశ్వశక్తితో అనగా వ్యక్తిగత మనస్సును విశ్వమనస్సుతో సంబంధము నేర్పరచు కొనుటయే యోగము. యోగము వలన దత్తము చేసికొన్న శక్తి దత్తశక్తి అదే దత్తాత్రేయుడు.ఇదే దత్తసంప్రదాయము. ఇవే సనాతన సంప్రదాయము వ్యక్తి తనలోని శక్తిని జాగృతము జేసికొని, విశ్వశక్తితో శాశ్వత సంబధము నేర్పరచుకొని, తానొక శక్తి స్వరూపముగా మారి విశ్వకళ్యాణ మొనరించుట సనాతన ధర్మము. భావసమైక్యతకు, మానవ సమైక్యతకు, భిన్నత్వములో నేకత్వ సాధనకు దత్తోపాసన యెంతయో తోడ్పడును. విశ్వశక్తిని దత్తము చేసికొన్న యోగులు, దత్తావతారులుగా, సద్గురువులుగా పరిగణింప బడుచున్నారు.

ఇప్పటికి దాదాపు ఇరువదేడు ఇరువదెనిమిది సంవత్సరముల క్రిందట దత్తావతారులైన శ్రీ శ్రీధర మహారాజ్ ప్రియ శిష్యులైన సమర్థ సద్గురు శ్రీ దత్తాత్రేయ మహారాజ్ ఆనాడు శ్రీరామకృష్ణ పరమహంస వివేకానందునకు వలె మంత్ర ప్రదానముతో తమ శక్తినంతయు వారికి ధార పోసిరి. ఆనాటి నుండి ఇరువది యొక్క సంవత్సరములు వారు అచంచల దీక్షతో, నైష్ఠిక బ్రహ్మ చర్యముతో, అహంకారమమకారములను వదలి, తీవ్రాతి తీవ్రముగా శోధనచేసి, సాధనచేసి గ్రంధిత్రయ భేదన మొనర్చుకొని, చిచ్ఛక్తిని దత్తము చేసికొని విశ్వయోగులై, నేడు విశ్వదత్తులైనారు. ఆ దత్త స్వరూపులు సదయులై ప్రసాదించిన" ఓం శ్రీ సాయిరాం గురుదేవ దత్త" యనుమంత్రము సర్వాభీష్టములను ప్రసాదించుచు భక్తులపాలిటి కల్ప వృక్షమైనది. ఆ మహాత్ముని దివ్యనామము ఒక్కసారి స్మరించినంత మాత్రమున ఎటువంటి బాధలైనను పటాపంచలైపోయి, మనస్సుకు శాంతి చేకూరగలదు. వారు నివసించియున్న "విశ్వమందిరము" మనకు "గురు స్థానము". శ్రీ విశ్వయోగి విశ్వంజీవారు సాయిదత్తులు· విశ్వదత్తులు, వారు సాక్షాత్తు గురు దేవదత్తులు"

జ్ఞానవృద్ధుని పలుకులు విని ఆ సాధకుడు శరీరము రోమాంచమంద, ఆ మందానంద కందళిత హృదయార విందుడై, అనన్యమైన భక్తితో, ఆ గురుమూర్తి తన యెదుట సాక్షాత్కరించి నట్లు దివ్యానుభూతి పొందినవాడై తన్మయత్వముననిట్లు స్తుతించెను.

గురుమధ్యే స్థితం విశ్వం, విశ్వమధ్యేస్థితో గురుః
గురుర్విశ్వం నచాన్యోస్తి, తస్మై శ్రీగురవేనమః
ఓం శ్రీం విశ్వదత్తాయనమః. ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త

ప్రథమాధ్యాయము సమాప్తము

# ద్వితీయాధ్యాయము

సాధకుని గురుభక్తి పారమ్యమును జూచి, సంతోషించినవాడై ఆ గుణవృద్ధుడు అతనిని సాదరముగా ఆలింగనము చేసుకొని, వాత్సల్య దృక్కులు ప్రసరింపుచు "నాయనా ! నీపై విశ్వదత్త దివ్యానుగ్రహము పరిపూర్ణముగా ప్రసరించుచున్నది. కావుననే ఆ సద్గురువు నాచే నిట్లు పలికించుచున్నాడు. నీవు ధన్యుడవు. నీ వలన గురు చరిత్రను స్మరించు భాగ్యము నేడు నాకు కలిగినది. దత్త సంప్రదాయములో గురువే పర బ్రహ్మ. గురువుకన్న పూజ్యమైనది మరొకటి లేదు. ఈ తత్త్వము బోధించుటకే గురు చరిత్ర, గురు గీత మొదలగు గ్రంథములు వెలసినవి.

ధ్యాన మూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదమ్
మంత్రమూలం గురోర్వాక్యం మోక్షమూలం గురోఃకృపా.

మనము గురువు రూపమునే ధ్యానించవలెను. వారి పాదములనే పూజించవలెను. వారి వాక్యమునే మంత్రముగా భావించవలెను. మోక్షమునకై వారి దయనే అర్థించవలెను.

గంగాపాపం శశితాపం దైన్యం కల్పతరుస్తథా
పాపం తాపంచ దైన్యంచ హరతి శ్రీ గురుదర్శనాత్

నాయనా! గంగానది పాప మొక్కదానికే బోగొట్టగలదు. చంద్రుడు ఒక్క తాపమునే హరించగలడు. కల్పవృక్షము ఒక్క దైన్యమునే తొల గించ గలదు. గురువును దర్శించినంత మాత్రమున పాపము, తాపము, దైన్యము మూడును క్షణములో నశించగలవు. కావున సకల దేవతా స్వరూపముగా గురువును భావించి పూజించుచుండవలెను. శ్రీకృష్ణుడు

భగవద్గీతలో "యోగులు నా హృదయ"మని చెప్పెను. యోగీశ్వరులకు భగవంతునకు భేదము లేదు. మానవులు తమ కర్తవ్యమును మరచి అధర్మాచరణులగుచున్నప్పుడు, ఆయా ప్రదేశములలో యోగీశ్వరు లుద్భ వించి, కర్తవ్యోపదేశము చేసి, జనులను సవ్య మార్గమున బెట్టి, వ్యవహా రములను చక్కబెట్టుదురు. ఆ సద్గురువులు దీప స్తంభములవలె మార్గ దర్శకులై తోడ్పడి, మనకు నడువవలసిన సన్మార్గములను, సత్ప్రవర్తనము లను జూపింతురు. ఈ విధముగనే శ్రీపాద శ్రీవల్లభులు, శ్రీ నరసింహా సరస్వతి, శ్రీ మాణిక్య ప్రభువు, శ్రీ అక్కలకోట మహారాజ్, శ్రీ షిర్డి సాయిబాబా, శ్రీ వాసుదేవానంద సరస్వతి, శ్రీ ఏకనాధ్, శ్రీ సమర్థ రామదాసు, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ అరవిందులు, శ్రీ రమణ మహర్షి మున్నగువారు, ఇంకను పలువురు యోగులు, సిద్ధపురుషులు వేరు వేరు సమయములందు జన్మించి లోకులకు సన్మార్గము జూపిరి. ఆ విధము గనే శ్రీ విశ్వయోగి విశ్వంజీ వారు గూడ నేడు గుంటూరులో వెలసి, విశ్వదత్తులై విశ్వ మానవ సమైక్యతకు దీక్షాబద్ధులైనారు. వారి బోధలు మనకు ఉభయతారకములు. "మనుష్యుడు కారువంటివాడు. భగవంతుడు పెట్రోలులాంటివాడు. గురువు డ్రైవరువంటివాడు. గురువు పర్యవేక్ష ణలో, భగవంతునిపై విశ్వాసంతో. మనుష్యుడు జీవితాన్ని సఫలం జేసు కోవాలి" అని వారు తరచు చెప్పుచుందురు.

ఆ సద్గురు వెంతటి మానవతావాదియో, వ్యక్తిని సంస్కరించి, తద్వారా కుటుంబమును సంస్కరించినగాని సమాజాభివృద్ధి కలుగదని తత్కార్య సాధన కెంతగా తపించుచున్నారో వారి మాటలు వినిన నీకే బోధపడగలదు. వినుము.

"ఈ యావత్ ప్రపంచములో దివ్య శక్తి ఒకటి నిండి యున్నది.

అది అన్నిటిని తిప్పుతున్నది. అది సర్వ శక్తివంతమైనది. సర్వత్రా ఉన్నది. సర్వము తానేమైనది. అదే శక్తి ప్రతి ప్రాణిలోను, మనిషిలోను ఉన్నది. అదే శక్తి పరమాణువులో గూడ నున్నది. ఈ సత్యాన్ని మానవుడు గ్రహించక భగవంతుడు ఎక్కడో దూరంగా నున్నాడని పొర బాటు పడుతున్నాడు. తన తోటి మానవుల్లో దేవుడున్నాడని గ్రహించక, మనిషిని మనిషిగా ప్రేమించలేక పోతున్నాడు. పైగా ద్వేషిస్తున్నాడు. ఇలా ద్వేషించమని సనాతన భారతీయ ధర్మం ఎక్కడా చెప్పలేదు."

"కుటుంబం సనాతన ధర్మానికి మూల స్తంభం. వ్యక్తి వికాసం ద్వారా కుటుంబ వికాసం సాధించాలి. కుటుంబముల సమైక్య కృషి ద్వారా సమాజ వికాసాన్ని సాధించటమే సనాతన ధర్మ లక్ష్యం. ఈనాడు వ్యక్తులు కుల మతాల పేరుతో పరస్పరం దూరమౌతున్నారు. వాళ్ళను ఆధ్యాత్మికత ద్వారా సంఘటితం చేయాలి. ఏక మనస్కులుగా తీర్చి దిద్దాలి. తద్వారా సమాజ వికాసాన్ని సాధించాలి. ఆధ్యాత్మికతవల్ల సమాజానికి మేలు కలగాలి."

"మహిమలనేవి ఉన్నవా ?" అని అడిగే వారిని చూచి ఆయన "మహిమలనేవి లేవు. జాగ్రత్తగా వినండి. శస్త్ర వైద్య నిపుణుడైన డాక్టరు రోజూ కొన్ని వందల ఆపరేషన్లు చేస్తాడు. ఆ విధంగా కోటాను కోట్ల జనం చెయ్యలేరు. చెయ్యలేని వారికి అలా చేయటం ఒక వింత గాను మహిమగాను అనిపిస్తుంది. ఆపరేషన్లు చేయడం నేర్చుకున్న డాక్టర్లకు అది సహజంగా కనిపిస్తుంది. అలాగే భగవత్ శక్తి వలన డాక్టరు ఆపరేషన్లు చేస్తున్నాడు. ఇంజనీరు అద్భుతంగా కట్టడాలు కడుతున్నాడు. మరొకడు మరొకటి చేస్తున్నాడు. మన దృష్టికి అది మహిమ. వాళ్ళ దృష్టికి అది సహజం. అలాగే యోగులు నీటిమీద నడుస్తారు. అది

వారికి సహజం. మన మనస్సుకు అలాంటి శిక్షణ యిస్తే మనమూ అలా చేయవచ్చు. శక్తి పదార్థముగా మారుతుందని భౌతికశాస్త్రం అంగీకరిస్తున్నది. భౌతిక పదార్థములను మనోశక్తిచేత యోగులు ఉత్పత్తి చేయగలరు. చెట్టు బొగ్గుపులుసు వాయువును గ్రహించి, సూర్యరశ్మిలో కొయ్యను తయారుచేసుకొనుచున్నది. అట్లే యోగులు తమ చుట్టూ వుండు గాలిని ఉపయోగించి, మనోశక్తితో తాము కోరిన పదార్థములను మొదట సూక్ష్మావస్థలోను, తరువాత స్థూల రూపంలోను నిర్మించగలరు. మనోశక్తి చాలా ప్రభావం గలది. మంత్రం మనిషిని మహాశక్తి కేంద్రంగా మారుస్తుంది. "ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త" అనే మంత్రాన్ని అందరూ నియమ నిష్ఠలతో ఉపాసించండి. లేదా మీ కిష్టమైన మరొక మంత్రం జపం చెయ్యండి" అని బోధిస్తారు.

నాయనా ! వారి బోధలు వేదాంతమును నేటి శాస్త్రీయ దృక్పథముతో సమన్వయించి ఎట్లు చూపుచున్నవో తెలిసినది కదా ! వారు తరతరాలకు పనికి వచ్చే దివ్య సందేశాలను తరగని గనివంటి తమ హృదయము నుండి తీసి అందించుచుందురు. "దేహమే దేవాలయం. దయగల హృదయమే దైవ మందిరము", "సత్యం, శీలం, పవిత్రత, ఐక్యత అనునవి సనాతన ధర్మమునకు మూలస్తంభాలు", "ఆత్మనిగ్రహం, ఆత్మ విశ్వాసం, ఆత్మత్యాగం అనేవి ఆత్మ సాక్షాత్కారానికి దారి చూపును", "తల్లిదండ్రులను ఉపేక్షిస్తే దేవుడు దొరకడు", "అదుపు పొదుపు పాటించు", "రాముడన్నా, రహీమన్నా, యెహోవా అన్నా, నానక్ అన్నా ఒకడే !". "మనదంతా ఒకే కులం. అది మానవ కులం. మనదంతా ఒకే మతం. అది ప్రేమ మతం". "పరిపూర్ణ మానవత్వమే దైవత్వం". ఈ మొదలైన వారి సూక్తులు పదిలంగా మనం మన హృదయ పేటికలలో భద్రపరచుకొనదగినవి,

మానవుడైనవాడు ఎట్లాదరించవలెనో అట్లా చరించి చూపుటే వారి లక్ష్యము. కులమత రహితముగా మానవులనందరిని సమైక్యపరచుటయే వారి ధ్యేయము. మనిషిని మనిషిగా, మహామనీషిగా తీర్చిదిద్దవలయునన్నదే వారి సాధన. అందులకై వారెంచుకొనిన మార్గము విలక్షణమైనది. తమ దగ్గరకు వచ్చెడి ప్రతి వ్యక్తిని వారు ప్రేమతో లాలించి, బుజ్జగించెదరు ఎటువంటివాడైనను ఆ ప్రేమకు లోబడక తప్పదు. ఒక్కొక్కప్పుడు ఉక్కు కన్నను కఠినముగా నున్నట్లు కనిపించినను వారి హృదయము ప్రేమభరితము. మనలను సంస్కరించుటకు వారు కోపముతో నున్నట్లు కనిపింతురేగాని వారు భక్తులను తిరస్కరించిన క్షణమొక్కటైనను లేదు. వ్యక్తి సంస్కరణము ద్వారా సమాజమును బాగుచేయవలయునన్నదే వారి తపస్సు. తనను దేవుడని, అవతారపురుషుడని చెప్పువారల నుద్దేశించి "నేను దేవుణ్ణి కాదు. దేవుడి సేవకుణ్ణి. మీలాగే రెండు కాళ్ళు, రెండు చేతులు ఉన్న మానవుణ్ని. మనిషి మనిషిలా బ్రతకాలని తాపత్రయపడు తున్న పిచ్చివాణ్ని" అని వారు పలుకుదురు.

బాలోన్మత్త పిశాచమువలె మెలగుచున్న ఆ మహాత్ముని చూచి సామాన్య మానవుడని మనము భ్రమపడరాదు. బ్రహ్మ విష్ణు శివాత్మక మైన పరబ్రహ్మ స్వరూపముగా వారి నెంచవలయును. మన పూర్వ పుణ్య విశేషము వలన మనకిట్టి సద్గురువు లభించినాడు. ఆయన సన్నిధి మన కొక పెన్నిధి. మత సంబంధమైన ఉపన్యాసములు వినినప్పటికి పొంద నట్టిది, మత గ్రంథములు చదివినను తెలియనట్టిది యగు ఆత్మసాక్షాత్కా రము వారి ప్రాపకము వలన మనము సులభముగా పొందవచ్చును. నక్ష త్రములన్నియు కలిసినను ఇవ్వలేని వెలుగును సూర్యుడెట్లు ఇవ్వగలుగు చున్నాడో అట్లే మతోపన్యాసకులు, మత గ్రంథములు ఇవ్వలేని జ్ఞానమును

క్షణములో మనకు సద్గురువు ప్రసాదించగలడు. వారి వైఖరి, సంభాష ణలే రహస్యముగా మనకు సలహాల నిచ్చును. క్షమించుట, ఫలాపేక్ష లేకుండుట, దానము, ధర్మము, శరీరమును మనస్సును స్వాధీనమునందుంచు కొనుట, అహంకారము లేకపోవుట, నిత్య సంతుష్టులై యుండుట మొద లగు శుభ లక్షణములు వారి పవిత్ర జీవితము నుండి వారనుసరించుచున్న ప్పుడు భక్తులు కనిపెట్టుదురు. ఇది భక్తులకు వెలుగునిచ్చి పారమార్థికము లేవనెత్తును. ఆ సద్గురువు మనకు దీప స్తంభము వంటివారు. మార్గదర్శ కులు. వారి బోధలను విని, మనము బాగుగా అర్థము చేసుకొని, ఆచరణలో పెట్టినప్పుడే మనము నిజమైన శిష్యవర్గముగా, విశ్వ కుటుంబ సభ్యులుగా పరిగణించబడుదుము" అని గుణవృద్ధుడు పలుకగా ఆ సాధకుడు భక్తిపార వశ్యముతో కన్నులు మూసికొని, హృదయపూర్వకముగా విశ్వదత్త నిట్లు స్తుతించి, నమోవాకము లర్పించెను.

అజ్ఞానాంధ వివస్వంతం
బ్రహ్మావిష్ణు శివాత్మకం
ఆత్మానందప్రదం బుద్ధం
విశ్వదత్తం నమామ్యహం.

ఓం శ్రీం విశ్వదత్తాయనమః, ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త.

ద్వితీయాధ్యాయమ్ సమాప్తమ్

# తృతీయాధ్యాయము

గుణవృద్ధు డిట్లనుచున్నాడు. "నాయనా! సాధన ద్వారా మానవుడు దివ్యత్వము నెట్లు సంపాదించుకొనవచ్చునో భగవద్గీత వివరించిన విధము గనే మానవుడు తన మనస్సును విశ్వ మనస్సుతో కలిపి, విశ్వశక్తిని దత్తము చేసికొని, దత్తాత్రేయ స్వరూపముగా నెట్లు మారునో శ్రీ విశ్వయోగి విశ్వంజీ సద్గురు మహరాజ్ జీవితము మనకు వెల్లడించును. ఆత్మసాక్షాత్కారము కోరువాడు ముముక్షువు తన్ను తాను సంస్కరించుకొనవలసిన అవసర మెంతైన నున్నది. దయ, త్యాగము, బ్రహ్మచర్యము, నిస్వార్థము, నిష్కామము మున్నగు సాత్త్విక గుణములను ప్రోదిచేసికొని, వానిని సంరక్షించుకొనుచుండిననే గాని ఆత్మసాక్షాత్కారము లభించదు. మురికి గుడ్డకురంగు అద్దినచో అంటుకొనదు. దుమ్ముపేరుకొనిన అద్దములో చూచిన ముఖము కనిపించదు. పరిపూర్ణ మానవత్వము సాధించనిదీ, త్రికరణ శుద్ధిలేనిది దైవత్వము సిద్ధించదు. ఏకాగ్రత లేక, మనస్సును స్వాధీనము జేసికొనక ఎన్నికోట్లు జపము చేసినను, ఎన్ని పూజలు చేసినను, ఎన్ని తీర్థములలో మునిగినను ఫలితముండదు. యోగ్యత సంపాదించుకొన్న వ్యక్తికే యోగము సిద్ధించును. ఏ యోగి చరిత్రచూచినను, ఏ సిద్ధ పురుషుని చరితము పరికించినను ఈ సత్యమే గోచరించును. శ్రీ విశ్వంజీ జడ్చర్లలో శ్రీ దత్తాత్రేయ మహరాజ్ దగ్గర ఉపదేశము పొందిన నాటినుండి యిరువదియొక్క సంవత్సరములు తీవ్రాతి తీవ్రముగా, నైష్ఠిక బ్రహ్మచర్యముతో, అహంకారమమకారములను వదలి సాధనచేసిరి. క్రైస్తవమత గ్రంథమైన బైబిలును, మహమ్మదీయ మత గ్రంథమైన ఖురాన్‌ను చక్కగా అధ్యయనము చేసి, ఆయా మతానుసారముగా, రామకృష్ణపరమ హంసవలె ఉపాసనజేసి, సిద్ధిపొంది. "అన్ని మతముల సారమొక్కటే! భగవంతుడొక్కడే!" నన్న సత్యమును సందర్శించిరి. వారి

యోగసాధనలో అనేక దర్శనములతోబాటు అత్యద్భుతములైన అలౌకిక శక్తులు వారికి కలిగినవి.

ఒక సమయమున వారు సత్యసాయిబాబా జన్మదినోత్సవ వేడుకలు చూచుటకై పుట్టపర్తికి పోయిరి. అచ్చట పూర్వాశ్రమములో తమ మేనల్లుడైన పెద్దూరి ఆంజనేయులుగారింటిలో దిగిరి. సాయంకాలము ఆ ఇంటి డాబామీదకుపోగా, పిట్టగోడపై ఒక పూలకుండి వారికి కనిపించెను. అది అక్కడ యున్నచో నెవరినెత్తిపైనైనను జారిపడగలదని భావించి, ముందు జాగ్రత్త చర్యగా, దానిని పట్టుకొని క్రిందికి దింపుచుండిరి. ఆ కుండి చేతులనుండి జారి, వారి కుడికాలిపైబడి, బొటనవ్రేలు చితికి రక్తము ధారాపాతముగా కారసాగెను. కాలికి కట్టుకట్టించుకొని, పదిరోజులు వారు కాలు కదల్చుటకు గూడ వీలులేక చాలబాధపడిరి. ప్రశాంతినిలయము నందలి కార్యక్రమములు చూచుటకు పోవలయునన్న ఆయనను ఇద్దరు పట్టుకొని తీసికొని పోవలసివచ్చెను. ఆ దెబ్బవలన వారి కుడికాలి బొటనవ్రేలియందు గల సుషుమ్నా నాడికి చలనము సంభవించి, అద్భుతమైనరీతిలో కుండలిని జాగృతమైనది. అది వారి జీవితమును మలుపు త్రిప్పిన అద్భుతమైన ఒక దివ్యసంఘటన. ఇది జరిగిన కొన్ని దినములకే మరియొక విచిత్రము జరిగినది.

ఒకనాడు ధ్యానములో నుండగా దిగంబరియైన ఒక దివ్యసుందరి వారికి ప్రత్యక్షమైనది. వారినామె కౌగిలించుకొని, శరీరమునందంతటను చుంబించుచు, రక్తము కారునట్లు గోళ్ళతో శరీరమును రక్కసాగినది. కాని విశ్వంజీ వారి ధ్యాననిష్ఠ సడలలేదు. ఆ రమణీమణి వారిని అంతరిక్షములోనికి చాలాదూరము తీసుకొని పోయెను. ఆమె యెంత ప్రయత్నించినను వారి ఏకాగ్రత చెడలేదు. ఆమె యత్నములన్నియు నిష్ఫలమయ్యెను. అప్పుడామె విశ్వంజీ స్థైర్యమును, జితేంద్రియత్వమును

మెచ్చుకొని, దివ్య వస్త్రాభరణ కిరీటభూషితురాలై "నీమానసము విశ్వ మానసములో లగ్నమైనది. నీవు విశ్వయోగివైతి" వని శ్లాఘించెను. "నీ ఆత్మశక్తి విశ్వశక్తితో శాశ్వత సంబంధము నేర్పరచుకొన్నది. నీమనస్సు విషయేచ్ఛల యందు తగుల్కొనదని తేలిపోయినది. నా ఆకర్షణ కెవరు లొంగరో, వారికి నేను స్వాధీనమై దత్తమవుదును. నీకు స్వాధీనమైన విశ్వ శక్తిని నేను. నీ దత్త శక్తిని నేను" అని పలికి ఆమె విశ్వంజీలో కలసిపోయెను. ఆ క్షణమే విశ్వంజీ శ్రీ విశ్వయోగిగా నూతన జన్మ మెత్తినారు. పాత జీవితము మరణించినది. కొత్త జీవితము ప్రభవించి నది. మామూలు పాంచ భౌతిక శరీరము యోగశరీరముగా మారినది. ఒక మానవశక్తి ఒక మహాయోగశక్తిగా లోకహితార్థము భువిపై పరిణామము చెందినది. నాయనా! ఆ దిగంబరి యెవ్వరోకాదు. దిగంబరావధూత యైన దత్త ప్రభువు యొక్క శక్తి స్వరూపము! ఆ దేవి నిర్దేశించిన భవిష్యత్ కార్యక్రమము ప్రకారము వారు వ్యక్తి సంస్కారము ద్వారా విశ్వ మానవ సమైక్యతాసాధనకు కృతనిశ్చయులైనారు.

ఒకసారి ఆయన అమ్మ దర్శనార్థము జిల్లెళ్ళమూడి పోయిరి. ఈ విశ్వదత్తనుచూచి, ఆ అనసూయామాత పట్టరాని వాత్సల్యముతో దగ్గరకు తీసుకొని, ముద్దుపెట్టుకొని మనసారా మూడు ముద్దలు అన్నము నోటిలో పెట్టి తినిపించినది. ముద్దముద్దకు వారి శరీరములో నూతనోత్తేజము పర వళ్ళుత్రొక్కసాగినది. అమ్మపెట్టినది అన్నపుముద్దలుకావు. జ్ఞానకళికలు. చిచ్ఛక్తి స్వరూపమైన అమ్మ ఇచ్ఛాశక్తి జ్ఞాన శక్తి క్రియా శక్తులను శక్తి త్రయమును వారిలో ప్రవేశపెట్టినది. ఆ శక్తి ప్రసారముతో వారిహృదయ మునుండి భవ్యదివ్య కవితావేశము పెల్లుబికినది. వారి ఆత్మసాక్షాత్కా

రమునకు అద్దము పట్టినట్లుగా దివ్యభావసుగంధ బంధురమైన "అనురాగ లహరి" వెలువడినది.

వారి సాధనాదశలో ఎందరు యోగులు, ఎందరు సిద్ధులు, ఎందరు అవతార పురుషులు ప్రత్యక్షముగా పరోక్షముగా వారికి తమశక్తి ధారపోసిరో? ఎందరు దేవతలు కరుణించి ఆశీస్సులు కురిపించిరో! అత్యద్భుతమైన శక్తులు వారికి కలిగినవి. స్వహస్తముతో వారు ప్రసాదించు విభూతి వ్యాధుల పాలిటి వజ్రాయుధమైనది. వారి హక్కు వేదవాక్కు అయినదీ. వారి హృదయము ప్రేమామృతపూర్ణమై భక్త హృదయాకర్షకమైనది. ఎందరెందరో, ఎన్నెన్నో సమస్యలతో సతమతమగుచువచ్చి, దర్శన మాత్రమున నే పరిష్కారము పొంది, శాంతి చిత్తులై, సంతుష్టులై వెడలిపోవుచుందురు. వారు దయతో అనుగ్రహించిన "ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త" అను మహామంత్రము భక్తుల పాలిటి చింతామణియైనది.

విశ్వంజీ విశ్వయోగిగా మారిన విషయమును మొట్టమొదట కనుగొన్నవారు శ్రీ జమ్మలమడక మాధవరామ శర్మగారు. మొదటినుండియు వారు శ్రీ విశ్వంజీపై పుత్రవాత్సల్యము వెల్లడించుచుండెడివారు. సాధనాదశలో అప్పుడప్పుడు విశ్వంజీ ఆయన కడకు పోయి తమకు కలిగిన సందేహములను తెలిపి తీర్చుకొనుచుండెడివారు. ఆ బ్రాహ్మీమయమూర్తులు శ్రీ విశ్వంజీలో దినదినప్రవర్ధమానమగుచున్న యోగశక్తిని దర్శించుచు ముదమందుచుండిరి. క్రమక్రమముగా ఆయనకు విశ్వంజీ యెడ గౌరవాభిమానములు, పూజ్యభావము కలిగెను. ఆ తరువాత చందోలు శాస్త్రి గారుగా ప్రసిద్ధికెక్కిన బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రిగారు,

శ్రీరామశరణ్ కుందుర్తి వెంకటనరసయ్యగారు మొదలైనవారు విశ్వంజీలో దత్తాత్రేయ శక్తిని దర్శించిరి.

మాధవరామశర్మగారికి వారి జీవిత చరమదశలో ఒక దృష్టాంతమైనది. కంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీచంద్రశేఖరేంద్రసర్వస్వతీ స్వామివారు కలలో కనిపించిరి. అప్పుడు శ్రీ శర్మగారు శ్రీ స్వామివారు లోగడ తమకు ప్రసాదించిన శ్రీ చక్రము, శంఖము తాను పూజించుటకు అశక్తులగుటచే వానినెవరి కిమ్మందురని ప్రశ్నించెను. శ్రీ స్వామివారు విశ్వంజీనిచూపి "ఆ దత్తమూర్తికి వానిని దత్తముచేయు"మని చెప్పిరి.

మరునాడు వారికి మరియొక దృష్టాంతమైనది. వారికి విశ్వంజీ ఆరుమీటర్ల శ్వేతవస్త్రము ప్రదానము చేసిరి. అదిచూచి శ్రీ శర్మగారు తమ అంత్యకాలము సమీపించినదనుటకు అదియొక నిదర్శనమని భావించి, తమదగ్గరికి వచ్చిన శ్రీమతి కల్పనకు, మరియు శ్రీ ఆకుల కోటేశ్వర రావు ధర్మపత్నియైన శ్రీమతి కామేశ్వరికి శంఖము చక్రమునొసగి, వానిని శ్రీ విశ్వయోగికి తామిచ్చినట్లు చెప్పి యొసగుడని పలికెను. ఈశ్వరి శ్రీ చక్రము వారి నుండి అందుకొనుచున్నప్పుడు అది బరువుగా, వేడిగా నున్నట్లనిపించెను. క్రమముగా ఆ వేడి శరీరములోనికి పాకుచున్నట్లని పించెను. అవి తీసుకొని వారు రైలుపేటకుపోయి, అచ్చట విశ్వమందిర ములో నున్న విశ్వయోగికిచ్చిరి. వారి దగ్గర నుండి అవి అందుకొను చుండగా విశ్వయోగి సుఖము కందినట్లయ్యెను. వారు వానిని పీఠముపై నుంచి, వెంటనే బావిదగ్గరకుపోయి. ముప్పది నలుబది బక్కెట్ల నీరు తోడుకొని తలపై పోసుకొనిరి. ఆ పిదప ఎఱ్ఱని వస్త్రముకట్టుకొని, ఎఱ్ఱని

ఉత్తరీయము ధరించి, పూజా గృహములోనికి వచ్చి శ్రీశర్మగారిచ్చిన శ్రీ చక్రము, శంఖములను పూజించి హారతియిచ్చిరి. శ్రీ దత్త స్వరూపులైన శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామివారు తమ శ్రీచక్రముద్వార తమ దత్తశక్తిని భవిష్యత్ కార్యక్రమమునకై విశ్వయోగిలో ఇట్లు ప్రవేశ పెట్టిరి.

శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారు శ్రీ విశ్వయోగిలో తమ ఆరాధ్యదైవమైన దత్త ప్రభువును దర్శించిరి. విశ్వమందిర కుటుంబ సభ్యులు నిర్వహించు కార్యక్రమములలో తరచుగా వారు పాల్గొనుచుండెడి వారు. విశ్వయోగికి వారనిన ఎంతయో గౌరవము,పూజ్య భావములుండెడివి. ఒకరోజు ఆయనను విశ్వ మందిరమునకు తోడుకొనివచ్చి, తాము నిత్యము ఆసీనులై భక్తకోటి ననుగ్రహించుచున్న పీఠముపై వారిని కూర్చుండబెట్టి, తాము వారి పాదముల ముందల నేలపై విశ్వయోగి కూర్చుండిరి. అదిచూచి శాస్త్రిగారు "మీరు క్రిందనే కూర్చున్నారు" అనిరి. విశ్వయోగి చిరునవ్వు నవ్వుచు" నేను కుర్చీలోనే కూర్చున్నాను గదా!" యనిరి. ఆ మాటవిని శాస్త్రిగారు తృప్తిగా నవ్విరి. మహాను భావుల భాషణములు విచిత్రములై దివ్యతత్త్వార్థ బోధకములై యుండును. ఆ మహనీయుల మాటలు వారి అద్వైతస్థితిని వెల్లడించునవిగా యుండెనని ఆ సంభాషణ విన్నవారు భావించిరి. శ్రీ శాస్త్రిగారి చివరిరోజులలో, వారిని చూచుటకై వెళ్ళి, విశ్వయోగి ఆయన ఆశీస్సుల నర్థించెను. ఆయన నవ్వి "నామీద దయతో మీరిక్కడకు వచ్చారు. నేను మీకు ఆశీస్సులివ్వటమా! దత్త స్వరూపులు మీరు. మీరే అందరికి ఆశీస్సులివ్వాలి" అని అంజలిఘటించిరి.

డాక్టర్ కరణ్ సింగ్, శ్రీ ప్రజ్ఞానందస్వామి, శ్రీ సాయిపాద రేణు మహాభాష్యం రంగాచారి, శ్రీ విద్యారణ్యతీర్థ, జగద్గురు శ్రీ జయేంద్ర సరస్వతి మున్నగు మహామహులెందరో "విశ్వయోగి దత్తావతార"మని లోకమునకు చాటిరి. సమర్థుడు సద్గురువుగా లభించుట మన పూర్వజన్మ సుకృత"మని 'జ్ఞానవృద్ధుడు పలుకగా సాధకుడు కన్నులు మూసికొని, భక్తి ప్రపత్తులతో అంజలిబద్ధుడై విశ్వదత్త నిట్లు స్తుతించెను.

అవధూతం మహాత్మానం
సచ్చిదానంద విగ్రహం
అనంతమహిమోపేతం
విశ్వదత్తం నమామ్యహం।
ఓం శ్రీం విశ్వదత్తాయనమః
ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త
తృతీయాధ్యాయము సమాప్తము.

## చతుర్థాధ్యాయము

సాధకుడు గుణవృద్ధుని గాంచి "స్వామీ! విశ్వదత్త లీలలు అద్భుతములై విననకొలదీ మరింత వినవలయునకు తృష్ణ జనించుచున్నది. ఆత్మసాక్షాత్కారము పొందిన పిదప సమాజ శ్రేయస్సుకై ఇట్లు పాటుబడెడు వారు చాల అరుదు. విశ్వదత్తయనెడి పేరు వారికి సార్థకమైనది. మరి

కొన్ని విశేషములు దయమంచి తెలుపు"డని ప్రార్థించెను. అప్పుడు గుణ వృద్ధు డిట్లనెను.

విశ్వదత్తమహిమ వివరించ కష్టమ్ము
అవని పైని నరున కెవనికేని;
"విబుధ వరులవలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపరతు"

గుంటూరు సమీపమున గల 'చమళ్ళమూడి' వారి స్వగ్రామము· ఆయన **1944** సంవత్సరము మార్చి 5 వ తేదీన గుంటూరులో జన్మించిరి. తల్లిదండ్రులు వరలక్ష్మమ్మ, ఆంజనేయులుగార్లు, శ్రీ నరసింహ సరస్వతీ స్వామి జనించిన వాజసనేయ (యాజ్ఞవల్క్య) శాఖలోనే వారును జన్మించిరి.వారిది శ్రీవత్సస గోత్రము.తండ్రిగారు గుఱ్ఱప్పడియ ఆంజనేయులుగారు మహాతపస్వి,దత్తప్రభువువారికి స్వప్నములో దర్శనమిచ్చి తారకమంత్రము నుపదేశించిరి· వారు మహా కవులు. పరమ నైష్ఠికులు· ఒక సారి ఆయన కారణాంతరములవలన కాశికిపోయి అచ్చట కొన్నాళ్ళు నివసించిరి. ఒక నాటిరాత్రి ఆయనకు విశ్వనాథ జ్యోతిర్లింగమునుండి కాంతి పుంజములు వెలువడుచున్నట్లు దృష్టాంతమయ్యెను. సరిగా ఆ సమయములోనే గుంటూరులో తమకు పుత్రుడు కలుగుటవలన ఆ శిశువునకు "విశ్వనాథ శాస్త్రి"యని పేరుపెట్టిరి· అందరును ఆయనను విశ్వమని పిలువజొచ్చిరి. శైశవములోనే ఆయన తన లీలలు ప్రదర్శించెను. ఉయ్యాలలో పండుకొనబెట్టిన శిశువు నేలపై శయనించియుండుట - ఒక గదిలో పరుండబెట్టిన

శిశువు మరియొక గదిలో కనిపించుట చూచి తల్లిగారు ఆశ్చర్యపడిరి. ఎవ్వరైనను ఆపిల్లవానిని అచ్చట పడుకొనబెట్టి యుండవచ్చునని తలచుచు సమాధానపడుచుండెడిది.

ఒకసారి ఆమె తన కుమారుడు ధ్యానము చేసుకొనుచున్న గదిలోనికి తొంగి చూడగా పీటమీద కూర్చున్నవాడు పీటమీద యుండక, పీటపై ఒకమీటరుఎత్తున శూన్యములో పద్మాసనము వేసికొని యుండుట కని ఆమె వెరగందెను. కొన్ని నిముషములకు ఆయన క్రిందికిదిగి పీటపై కూర్చున్న తరువాత ఆమె గట్టిగా ఊపిరి పీల్చుకొనెను. గురువుగారి నుండి మంత్రోపదేశము పొందక పూర్వమే ఇట్టి మహిమలు ఆయన చూపెను. ఆయన చేతితో ఇచ్చిన భస్మము ఆ కాలములోనే బాధలను తొలగించుచుండెడిది.

విశ్వంజీ ఉపాధ్యాయ వృత్తిలోనున్నప్పుడు ఒకసారి తమ సహోధ్యాపకుడైన అయ్యన్న మాస్టారును వెంటదీసుకొని పుట్టపర్తి వెళ్ళిరి. అక్కడ విశ్వంజీకి జ్వరమువచ్చెను. మూడురోజులు జ్వరముతో బాధపడిరి. ఆ జ్వరములోనే ఒకరోజు ప్రశాంతి నిలయములోనున్న ఫలహారశాలకుపోయి మజ్జిగత్రాగిరి. వెంటనే వాంతియయ్యెను. వాంతిలో రక్తము పడుట జూచి అయ్యన్నగారు భయపడిరి. అప్పుడు విశ్వంజీ" భయములేదు. ఎవరికో ఇదిజరుగవలసియున్నది. నన్ను నమ్మినవారి బాధ నేనుస్వీకరింపక తప్పదుగదా !"యని పలికిరి. "ఇది ఎవరికర్మమో మనకెట్లు తెలియు"నని అయ్యన్నగారనగా శ్రీ విశ్వంజీ నవ్వి "మనము గుంటూరు వెళ్ళిన తరువాత అంతయు నీకే బోధపడగల"దని చెప్పిరి.

రెండు రోజులచ్చట యుండి విశ్వంజీ గుంటూరు వచ్చిరి. మరునాడు వారి గదికి ఒకాయన వచ్చి "మూడురోజుల క్రిందట మాయింటికి

ఒకవ్యక్తి వచ్చి, "మీ గురువుగారెవరు? మీరేమంత్ర మువాసించుచున్నారు? ఎవరో నాదగ్గరకు వచ్చిమీకు చాతబడి చేయుమని కోరగా అట్లు చేసితిని. కాని అది మీమీదపనిచేయక నాకు త్రిప్పికొట్టినది. నాకు రక్త వాంతులగు చున్నవి. దయచేసి మీ మంత్ర శక్తితో నన్ను రక్షించు"డని ప్రాదేయ పడెను. నాకు ఆశ్చర్యము వేసినది. "నాకేమియును మంత్రములు తంత్ర ములు తెలియవు. కాని నేను ప్రతిరోజు రైలు పేట మాస్టారుగదికి వెళ్ళి వచ్చుచుందును." అని ఆయనతో చెప్పితిని. అప్పుడాయన"నన్ను మీ మాస్టారు దగ్గరకు తీసుకొనిపొండి! ఆయనను వేడు కొనె"దనని ప్రతిరోజు వచ్చి నా ప్రాణము తీయుచున్నాడు. మీరనుజ్ఞ నిచ్చిన ఆయనను మీ దగ్గరకు తీసుకొని వచ్చెద"నని ఆ వ్యక్తి విశ్వంజీతో విన్నవించెను. విశ్వంజీ తమ ప్రక్కనున్న అయ్యన్నగారి వైపు చూచి నవ్విరి. అయ్యన్న గారికిది అంతయు అద్భుతముగా నుండెను. తరువాత విశ్వంజీ తమకడకు వచ్చిన ఆ చాతబడి చేసినవ్యక్తిని మందలించుచు 'ఆర్జించిన శక్తితో లోకహితమునకై పాటుబడవలయునుగాని నాశనమునకై ప్రయత్నించిన ఇట్టి గతియే పట్టు"నని బుద్ధిచెప్పి పంపివేసిరి.

భక్తుల వ్యాధులెన్నింటినో విశ్వయోగి తాము గ్రహించి వారికి ఉప శమనము కలిగింతురు. డాక్టర్లకు లొంగని వ్యాధులను భస్మముచేత పోగొట్టుదురు. సంతానము కలుగదన్నవారికి సంతానము కలుగునట్లు చేయు దురు. ప్రఖ్యాత పారిశ్రామిక వేత్త శ్రీ జి. రామారాయుడిగారిని వ్యాధి నుండి రెండు సార్లు వారు కాపాడిరి. శ్రీ మాధవపెద్ది రాధాకృష్ణమూర్తి గారికి, శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారికి సత్యసాయిగా, మరి కొంత

మందికి శ్రీ రాముడిగా, దత్తుడుగా. శ్రీ షిర్డిసాయి నాథుడుగా, జిల్లెళ్ళమూడి అమ్మగా ఇట్లనేక రూపములతో దర్శనమొసగిరి హైదరాబాదులో నివసించుచున్న సుప్రీంకోర్టు న్యాయవాది నరసింహారావుగారికి విశ్వయోగియనిన ప్రాణము. శ్రీ విశ్వయోగి సాక్షాత్తు శ్రీ దత్తాత్రేయుడని వారి ప్రగాఢ విశ్వాసము.

కొందరు భక్తుల యిండ్లకు వేరొక శరీరము ధరించి శ్రీవిశ్వదత్త వెళ్ళిన సందర్భము లనేకములున్నవి. పొన్నూరు సమీపమునగల నండూరులో నివసించుచున్న సాయిబాబా భక్తురాలైన పూలమ్మగారితో ప్రతిగురువారము సాయంత్రము వారు సంభాషించుచుందురు. ఇది పూలమ్మగారు అందరితోడను చెప్పినమాట. ఒకరోజు ఆమె జ్వరము వచ్చి లేవలేక నీరసముగా మంచముపై పరుండియుండెను. ఆ రోజు గురుపూర్ణిమ. బాబాగారి ఊరేగింపు తమయింటిముందుకువచ్చినప్పుడు కొబ్బరికాయ కొట్టి, హారతి ఇవ్వలేక పోవుచున్నానుగదా! "యని ఆమె విచారించుచు విశ్వయోగిని స్మరించెను. వెంటనే విశ్వయోగి ఆమెదగ్గరకు వచ్చి, మంచము ప్రక్కనయున్న కుర్చీలో కూర్చుండిరి. ఆమె నుదుటిపై భస్మము రాసి, కొంతనోటిలోవేసి "ఏంభయవాలేదు. జ్వరం తగ్గుతుంది గాని ఊరికే కంగారు పడకు. ఒక పావుగంట కళ్ళుమూసికొని పడుకో - హారతి యిచ్చే శక్తి వస్తుంది"అని చెప్పి అదృశ్యమైరి. ఒక పావుగంటలో ఆమెకు చెమటలు పట్టి విచిత్రముగా జ్వరమంతయు తగ్గిపోయెను-బాబాకు స్వహస్తములతో ఆమెహారతి యిచ్చెను. పూలమ్మ గారిదగ్గరకు విశ్వయోగి పోయిన సమయములో వారు ఆస్నా శ్రీనివాసరావు కళ్యాణమంటపమునందు ఉదయము తొమ్మిదిమంటి

రాత్రి తొమ్మిదివరకు కార్యక్రమ నిమగ్నులై యుండుట వందల కొలది మంది చూచిన ప్రత్యక్షసాక్ష్యమున్నది. ఇట్లే రంగారెడ్డి జిల్లా జడ్జి శ్రీ దత్తాత్రేయులగారింటిలో రేపు విజయదశమి యనగా నవమినాటి రాత్రి విశ్వయోగి దర్శనమిచ్చిరి. వారిని ఆయనయేగాక ఆయన సతీమణి, కుమారుడుకూడా దర్శించిరి. ఆ అద్భుతానందము పట్టలేక వెంటనే ఆయన బయలుదేరి, విజయదశమి ఉదయమునకు గుంటూరుచేరి, విశ్వయోగిని దర్శించి, రాత్రి తాము పొందిన దివ్యానుభవమును వెల్లడించిరి. ఇట్లెందరికో వారు దర్శన మిచ్చుచున్నారు.

తాడికొండ విద్యా సంస్థల వ్యవస్థాపకులైన విద్వాన్ గోగినేని కనకయ్యగారికి విశ్వయోగిపైగల భక్తి శ్రద్ధలు అపారము. ఎందరెందరికో వారు విశ్వయోగి పరిచయభాగ్యమును కలిగించిరి. గోరి జవోలు పాండురంగారావు వంటి హేతువాదులెందరో వారి అమృత స్పర్శకు ప్రేమార్ద్రవీక్షణములకులోబడి దాసోహమగుచున్నారు. ఇంతకన్నను ఆయన మహిమకు నిదర్శనమేమికావలయునని గుణవృద్ధుడు పలికెను.

అనంత మహిమోపేతం
ఆధివ్యాధి వినాశకం
భక్తానందప్రదం దేవం
విశ్వదత్తం నమామ్యహం
ఓం శ్రీం విశ్వదత్తాయనమః
ఓం శ్రీసాయిరాం గురుదేవదత్త

చతుర్థాధ్యాయము సమాప్తము.

## పంచమాధ్యాయము

గుణవృద్ధుడిట్లనుచున్నాడు. నాయనా ! తామీ లోకమునకు వచ్చిన పని నెరవేర్చు నిమిత్తము స్వగృహమును, తల్లిని, సోదరులను బంధువులను వీడి కొంతకాలము రైలుపేటలో ఒకయిల్లు అద్దెకుతీసుకొని,విశ్వదత్త సాధనచేయుచుండిరని లోగడచెప్పియుంటిని.కొన్ని దినములకు ఆ యింటిని కూడ వదలి, శ్రీఆకుల కోటేశ్వరరావు దంపతుల భక్తికి లోబడి, వారి శ్రీనిలయమునే తమ నిలయముగా చేసికొని నివసించుట మొదలుపెట్టిరి. ఆ భవనమే నేడు విశ్వమందిరముగా పిలువబడుచున్నది. తాము కన్న కుమారుడు సురేష్, కుమార్తె మాధురి కన్న మిన్నగా ఆ దంపతులు విశ్వదత్తను వాత్సల్యపూరితులై భక్తిపరీతులై శ్రద్ధాసక్తులతో సేవించుచుండుట భక్తులకెల్లరకు మార్గదర్శకమై విలసిల్లుచున్నది.

శ్రీ విశ్వంజీ రైలుపేటలో నున్నప్పుడు ఒకసారి షిరిడియాత్ర తలపెట్టిరి. ఆ యాత్రలో పాల్గొను భాగ్యము శ్రీ కోటేశ్వరరావుగారి ధర్మపత్ని కామేశ్వరికి కలిగినది. ఆ యాత్రలో గురుదేవుల శక్తి ఎట్టిదో ఆమెకు బాగుగా తెలియవచ్చినది. అతిసారవ్యాధితో బాధపడుచున్న ఆమెకు విభూతి ప్రసాదమున స్వస్థత విశ్వదత్త చేకూర్చిరి. ఆ ప్రేమమూర్తిలో ఆమె సత్యసాయిబాబాను దర్శించి సర్వస్య శరణాగతురాలయ్యెను, నాటి నుండి ఆమె నిత్యము తమ యింటినుండి ఆహారము తెచ్చి విశ్వయోగికి పెట్టుచుండెను. విశ్వయోగిపై ఆమె చూపుచున్న వాత్సల్యము చూచి అందరును ఆమెను "యశోద"యని పిలిచెడివారు. ఆలనాడు కృష్ణునకు యశోదవలె, షిరిడీ సాయికి బయజాబాయివలె, సత్యసాయికి కరణము

సుబ్బమ్మవలె విశ్వయోగికి ఈశ్వరి కన్నతల్లి కన్న మిన్నయైనది. అది ఎన్ని జన్మల భక్తియో? ఆమె భక్తి విశ్వయోగిని బంధించివేసినది.

కోటేశ్వరరావు దంపతులు కృష్ణనగర్‌లో నూతనముగా భవనము నిర్మించి, వాస్తు దోషములేమైన యున్నచో సరిచూడుమని విశ్వయోగిని ప్రార్థించిరి. ఒకనాడు విశ్వయోగి వారి గృహమునకు హఠాత్తుగా వచ్చి, ఇల్లంతయు తిరిగి డాబామీదకు పోయి తన శాలువ పరచుకొని పరుండిరి. అది చూచి ఈశ్వరి ఆశ్చర్యపోయెను. ఆ యిల్లు తనదనియు, ఇక ముందు తామచ్చటనే నివసించదలచుకొనుచున్నాననియు తెలుపుటకుగాను వారట్లు చేసిరని ఆ తరువాత ఆ చర్యకు అర్థము తెలిసినది.

1988 లో దత్త జయంతి ఉత్సవములైన తరువాత రైలుపేటలోని తమ అద్దెయింటిని ఖాళీచేసి, ఆకుల కోటేశ్వరరావుగారి శ్రీనిలయమునే వారు విశ్వమందిరముగా జేసికొనిరి. 1988లో విశ్వయోగి 44వ జన్మదినోత్సవము మొట్టమొదటిసారిగా ఆ మందిరములో వైభవోపేతముగా జరిగెను. ఈ నాటి వరకు విశ్వయోగి జన్మదినోత్సవ వేడుకలామందిరమునందే జరుగుచున్నవి. 1989వ సంవత్సరములో తమ 45వ జన్మదినోత్సవ సందర్భమున సత్యము, శీలము, ఐకమత్యము, పవిత్రత అను నాలుగు ప్రధాన లక్ష్యాలతో విశ్వమానవ సమైక్యతా పతాకమును విశ్వమందిరములో వారు ఆవిష్కరించిరి. 1989 వ సంవత్సరములో గురుపూర్ణిమనాడు మాధవపెద్ది రాధాకృష్ణమూర్తిగారు కన్వీనర్‌గా, కరణం శ్రీ జి.వి. యల్ నరసింహారావు, జి. రామారాయుడు, ఆకుల కోటేశ్వరరావు,

డాక్టరు సి. మల్లికార్జునరావు, మానికొండ రాజారావు, విద్వాన్ గోగినేని కనకయ్య, దేచిరాజు వెంకట్రావువంటి వ్యక్తులు కార్యనిర్వాహక సభ్యులుగా విశ్వయోగి అధ్యక్షతన "విశ్వమానవ సమైక్యతా సంసత్" ఆవిర్భవించినది. విజ్ఞాన వేత్తల, మేధావంతుల జ్ఞానమును, మేధను సంఘటిత పరచి, విశ్వమానవ సౌభాగ్యము, విశ్వకల్యాణము సాధించుటయే ఆ సంసత్ ఉన్నతాశయము. సనాతన ధర్మమును, యోగ శాస్త్రమును ఆచరణలోనికి తీసికొనివచ్చుట, మానవునిలోని దివ్యత్వమును పెంపొందించుట, మున్నగు తొమ్మిది ప్రధాన ఆశయములతో ఆ సంసత్ మేధావులనందరిని సంఘటితపరచి, వారి శక్తులను సమాజసేవకొరకు సంసిద్ధపరచుట విశ్వంజీ ధ్యేయముగా పెట్టుకొనిరి. విశ్వ వికాస కేంద్రములు ఊరూర ప్రారంభించవలయునని గురుదేవుల సంకల్పము. దానికి నాందిగా పెదనందిపాడులో ఒక విశ్వవికాస కేంద్రము 1991 మార్చి 7న దాసరి శేషగిరిరావుగారి అధ్యక్షతన ఏర్పాటు చేసిరి.

గుంటూరు మదరాసు జాతీయ రహదారి పై గుంటూరుకు 16కి.మీ. దూరములో పదియకరముల సువిశాల మైదానమును 'విశ్వనగర్' గా రూపొందించి, అచ్చట 1991 మార్చి 30వ తేది సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి గౌ॥శ్రీ రంగనాథమిశ్రాగారిచే విశ్వమానవ సమైక్యతా స్థూపమునకు వైభవముగా శంఖుస్థాపన చేయించిరి. అచ్చట ఆ స్థూపనిర్మాణమిప్పుడు త్వరితగతిని జరుగుచున్నది. అక్కడ ఒక ఆడిటోరియమ్, నవజీవన్, మాఘకర్, శాంతికుటీరాలు, వైద్యాలయం మున్నగునవి

ఏర్పాటుచేయతలపెట్టిరి, ఈ బృహత్ ప్రణాళికతో నిర్మించబడుచున్న కట్టడములకు శ్రీయస్. యస్. నారాయణగారు రూపకల్పనచేయుచున్నారు. ఈ ప్రణాళిక అమలు అధిక వ్యయ ప్రయాసలతో కూడినది. దీనికి అశేష ధన, వస్తు సేవా సంపత్తులు కావలసియున్నవి. "ఈ విశ్వ మానవ సమైక్యతా స్థూపం నా లక్ష్యం, నా ప్రాణం, నా ధ్యేయం, నా గమ్యం. నా స్పందన. నా సర్వస్వం. ఇది జ్ఞానాలయం. దీని విజయమునకు కృషిచేయుటయే మీ నిజమైన భక్తి ప్రకటన" అని శ్రీశ్రీశ్రీ విశ్వయోగి ఆస్థూప శంఖుస్థాపన మహోత్సవ సభలో ప్రకటించిరి. ప్రతి వ్యక్తియు తన సాయశక్తుల ఈ మహాయజ్ఞమునకు సహకరించుట విధ్యుక్త ధర్మము. గురువు యెడ చూపవలసిన భక్తి శ్రద్ధలకు అదియే నిదర్శనము. గురువునకు భిక్ష ప్రసాదించుటకు ఇంతకన్నను సదవకాశము మరియొకటి లభించదు." అని గుణవృద్ధుడు పలికెను. అది విని ఆ సాధకుడు "స్వామీ! విశ్వదత్తను గురించి సమగ్రముగా బోధించి నాకు విశ్వదర్శనము చేయించినారు. మీమేలు ఈ జన్మములో మరువలేను" అని గుణ వృద్ధుని పాదపద్మములకు సాష్టాంగ నమస్కారము చేసి విశ్వదత్తనిట్లు స్తుతించెను.

నమో శ్రీ విశ్వనాథాయ
నమో శ్రీ విశ్వదత్తాయ
నమో శ్రీ విశ్వరక్షాయ
సద్గురవే నమో నమః॥

ఈ వ్రత కథ చదివిన వారికిని, విన్న వారికిని శ్రీ విశ్వదత్త అనుగ్రహమువలన ఐహికాముష్మిక సౌఖ్యములు గలిగి, సకలాభీష్టములు సిద్ధించగలవు, ఈ వ్రతము సల్పిన వారికి శ్రీ విశ్వదత్త దయవలన ఆయురారోగ్య ఐశ్వర్యములతో, పుత్ర పౌత్రాభివృద్ధి కలిగి అభ్యుదయ పరంపర లందగలరు.

ఓం శ్రీం విశ్వదత్తాయనమః

ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త

శ్రీ విశ్వదత్త వ్రతకథ సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

మహానైవేద్యం :

భక్ష్యం భోజ్యంచ లేహ్యంచ చోష్యంపానీయ మేవచ

ఇదంగృహాణ నైవేద్యం మయాదత్తం గురూత్తమ

సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయనమః మహానైవేద్యం సమర్పయామి(నీళ్ళ చల్లవలెను) అమృతమస్తు ! అమృతోపస్తరణమసి (ఉద్ధరిణెతో నీటిని చూపించి విడువవలెను. చేతితో నైవేద్యము చూపించవలెను.)

ఓంప్రాణాయనమః । ఓం అపానాయనమః । ఓంవ్యానాయనమః । ఓం ఉదానాయనమః । ఓంసమానాయనమః । మధ్యమధ్యే పానీయం సమర్పయామి । హస్తౌప్రక్షాళయామి । పాదౌప్రక్షాళయామి । శుద్ధాచమనీయం సమర్పయామి ।

తాంబూలం :

పూగీఫలసమాయుక్తం నాగవల్లీదళైర్యుతం

కర్పూర చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం

సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయనమః తాంబూలం సమర్పయామి

మంగళహారతి :

మంగళం జ్ఞానసంపన్న మంగళం సుజనప్రియ

మంగళం జగదుద్ధార మంగళం దేశికోత్తమ

సమర్థ సద్గురు శ్రీ విశ్వదత్తాయనమః నీరాజనం సమర్పయామి

హారతిపాటలు :

(1) త్రిగుణాత్మక త్రైమూర్తి దత్తాహజాణా
త్రిగుణా అవతార్ త్రైలోక్యరాణా
నేతినేతి శబ్ద నయే అనుమాన
సురవరమునిజనయోగి సమాధి నయేధ్యానా
జయదేవ జయదేవ జయసద్గురు దత్తా
హారతి ఓవాళి హారతి భవచింతా (3)

(2) స్వామి నరసింహ సరస్వతీగే గురుమూర్తీగే
యతివర్యాగె మంగళ కామిత కామఫలత్పూర్తిగెమంగళ
నిరుపమనిత్య నిరమాయాగె మంగళ
నిర్వాణవ్యక్త యతిరాయాగె మంగళ ॥ స్వామి॥
భక్తాజనరకల్పవృక్షగెమంగళ
భక్తియిందభజనువ మోక్షగెమంగళ ॥స్వామి॥
భీమాగంధర్వపుర వాసాగెమంగళ
భీమాశంకర గురువేషాగెమంగళ ॥ స్వామి ॥

(3) జయజయ గురుదేవా!-స్వామి! జయజయగురుదేవా!
బ్రహ్మావిష్ణు పరమేశ్వరరూపా! ఆనందానిలయా!
ఓం జయజయ గురుదేవా!
లోపలనీవే! వెలుపలనీవే! అంతయునీవేలే!

జగమంతయునీవేలే

అండపిండ బ్రహ్మాండములోన ఉన్నదినీవేలే!

నిండి ఉన్నది నీవేలే! ॥జయజయ॥

వేదమునీవే! నాదమునీవే! జ్ఞానమునీవేలే!

బ్రహ్మజ్ఞానమునీవేలే!

అందరిలోన వెలుగుచునున్న ఆత్మవునీవేలే!

పరమాత్మవునీవేలే॥

జయజయ గురుదేవా! స్వామి! జయజయగురుదేవా!

బ్రహ్మవిష్ణు పరమేశ్వరరూపా! ఆనందానిలయా॥ (3 సార్లు)

ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః

సమర్ధ సద్గురు శ్రీ విశ్వదత్త స్వరూప శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మహారాజ్ కీజై

అవధూతచింతన శ్రీ గురుదేవదత్తకీజై

సమర్ధసద్గురు శ్రీ సాయినాథ్ మహారాజ్ కీజై

సమస్త దేవతామూర్తోంకీజై

సమస్త సిద్ధ శక్తోంకీజై

సమస్త అవతారమూర్తోంకీజై

సమస్త మానవతామూర్తోంకీజై

సమర్ధ సద్గురు శ్రీ విశ్వదత్తాయనమః నీరాజనానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

**మంత్రపుష్పము :**

ఓం అవధూతాయ విద్మహే। అత్రిపుత్రాయధీమహి
తన్నోదత్తః ప్రచోదయాత్
ఓం విశ్వేశ్వరాయ విద్మహే।విశ్వనాథాయధీమహి
తన్నో విశ్వః ప్రచోదయాత్

**సమర్థ** సద్గురు శ్రీ విశ్వదత్తాయనమః సువర్ణ దివ్యమంత్రపుష్పం సమర్పయామి

**ఆత్మప్రదక్షిణ నమస్కారము :**

అన్యథా శరణంనాస్తి త్వమేవశరణంమమ
తస్మాత్ కారుణ్యభావేన రక్ష విశ్వదత్త ప్రభో!

ఆత్మప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి॰

సమర్థ సద్గురు శ్రీవిశ్వదత్తాయనమః
ఛత్రంసమర్పయామి
చామరం వీజయామి
నృత్యందర్శయామి
ఆందోళికా నారోహయామి
అశ్వానారోహయామి
గజానారోహయామి

**సమస్త** రాజోపచార దేవోపచార శక్త్యోపచార భక్త్యోపచార సర్వోపచార **పూజాం**సమర్పయామి. [అక్షతలు, పూలు ఉంచవలెను]

అనయాధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజాయచ,
అష్టోత్తర శతనామ పూజాయచ శ్రీ విశ్వదత్త వ్రతం సర్వం శ్రీ
విశ్వదత్త స్వరూప విశ్వయోగి విశ్వంజీ సద్గురు చరణార విందార్ప
ణమస్తు!

[అక్షతలు నీటిలో కలిపి పళ్ళెములో విడువవలెను]

శ్రీ విశ్వదత్త సమర్ధ సద్గురుదేవతా ప్రసాదం శిరసాగృహ్ణామి.

మమ శ్రీ శ్రీ శ్రీ విశ్వదత్త స్వరూప

విశ్వయోగి విశ్వంజీ సద్గురు దేవతా ప్రసాద సిద్ధిరస్తు

నీటిని విడువవలెను

ఓంశ్రీం విశ్వదత్తాయనమః

అవధూత చింతన శ్రీ గురుదేవదత్త

ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త

శ్రీ విశ్వదత్త వ్రతకల్పమ్ సర్వమ్ సంపూర్ణ మ్.

శ్రీ, శ్రీ. శ్రీ

# అనుబంధములు

[శ్రీ విశ్వయోగి విశ్వంజీ పూర్వాశ్రమంలో రచించిన రచనలు కొన్ని ఈ క్రింద ప్రచురిస్తున్నాం. ఆస్తిక మహాశయులు వానిలోని పరమార్థమును గ్రహించి తరించగలరని మనవి]

**1**

నాధ్యేయం, నాగమ్యం
మరువను మరువను ఎన్నటికీ
మరచినడువను ఎన్నటికి ....
నేవేసే ప్రతి అడుగు నీవైపే సాగాలి
నేపలికే ప్రతిమాటా నీమాటే కావాలి
నా ధ్యానం, నాప్రాణం సర్వస్వం నీవేలే ॥నాధ్యేయం॥
ఎన్నితుఫానులు కమ్ముకొచ్చినా -
ఎంతటి వేదన మదిలో రేగినా-
ఎందరెంద రవహేళన చేసినా
ఆగదు ఆగదు నా పయనం
ఆగదు ఆగదు నా పయనం ॥నా ధ్యేయం॥
తనువుకరిగినా--ధనముతరిగినా --
కరుగదు, తరుగదు నాధైర్యం

లోకాలన్ని ఎదురై వచ్చినా
జడియను జడియను ఎన్నటికి
జడిసి ఆగను ఎన్నటికి ॥నాధ్యేయం॥
నీలోనుండి వచ్చిననేనూ--
నీలోనే ఇక కలవాలి!
కలసి కలసి కరిగిపోయి
కలసి కలసి కరిగిపోయి
కన్నులపండుగ కావాలి!
నాకలలే ఫలించితీరాలి! ॥నాధ్యేయ॥

2

దేవుడు ఒక్కడు! ఒక్కడు! ఒక్కడు!
అందరికీ వాడొక్కడు! ఒక్కడు!

"సాయి" అన్నా "ఏసూ" అన్నా, "అల్లా" అన్నా "నానక్" అన్నా
"రాము"డన్నా "రహీము" అన్నా 'ఎహోవ'అన్నా 'ఈశ్వరు'డన్నా
ద్వేషం వద్దు! రోషం వద్దు! మతకులభేదం అసలేవద్దు !
ఎక్కువ తక్కువ లేనేలేదు! మనమంతా అసలే మనుషులమూ
విశ్వంలోని అణువే అంతా, విశ్వమేజగత్తు, జగత్తే విశ్వం
గురువే విశ్వం, విశ్వమెగురువు, విశ్వంశూన్యం, శూన్యమె గురువు
ఏకులమైనా, ఏమతమైనా, మనుషులమే మరి మనుజులమే!

మనుజులమంతా కలవాలి, మనసులనంతా కలపాలి!
ఒక్కమనసుగా మార్చాలి, ఒకే శక్తిగా మారాలి!
శాంతీశాంతీ శాంతియేలక్ష్యం, విశ్వశాంతియేమనకది లక్ష్యం
ఒక్కడికోసం అందరుకలసి, అందరికోసం ఒక్కడు నిలిచి
అందరిలోనేనొక్కడనని, నేనేవేరు కానేకాదని
కష్టాలన్నీ దూరం చేద్దాం· అవతలకవతల కంపేద్దాం!
మనిషికి మించినదైవం లేదు, మనసుకుమించి శక్తేలేదు
మనసులనంతా కలిపేసి, విశ్వశాంతినే సాధిద్దాం!
ఇదియే ఇదియే విశ్వం లక్ష్యం! ఇదియే విశ్వంప్రాణం!
ఇదియే ఇదియే విశ్వంధ్యానం! ఇదియే ఇదియే విశ్వంగమ్యం !
దేవుడు ఒక్కడు ఒక్కడు! ఒక్కడు! అందరికీ వాడొక్కడు·
ఒక్కడు!

3

నిన్నే నమ్మితి దత్తాత్రేయా!
నన్నుకావారా దత్తాత్రేయా!
మనమున నిరతము నిన్నే నిలిపి
పూజలు సలుపుదు దత్తాత్రేయా! ।నిన్నే।
ఆసనమా అది నా హృదయం
అర్ఘ్యపాద్యములు నా కన్నీళ్ళు
నైవేద్యము అది నాసర్వస్వం
మంగళహారతి కామదహనము ।నిన్నే।
యోగిరూపమున వెలసిన దేవా !

మమురక్షింపగ నిలచిన దేవా!

సనాతన ధర్మోద్ధరణకై

అవతరించిన ఓ అవధూతా ।నిన్నే।

4

ఊగుమా! ఊగుమా! ఊగుమాయోగీ!

ఊపెద! ఊయల! ఊగుమాయోగీ! (2)

సత్యంధర్మం శాంతి ప్రేమలను

గొలుసుల ఊయల కట్టినానయా! (2)

ప్రశాంతి పరిమళం వెదజల్లే

భక్తివీవెనే వీచెదనయ్యా—ఊగుమా॥

హృదయమె పరుపుగ పరచినానయా!

మనసునె తలగడ జేసినానయా! (2)

వేదన పాటగమార్చినానయా!

ఆవేదన తీర్చగ వేగరావయా!— ఊగుమా॥

కామంక్రోధం లోభంమోహం

మదమాత్సర్యం బసగొట్టైనయా! (2)

అహమను సర్పము పడగవిప్పెను

పడకగ మార్చి పవళించవయా—ఊగుమా॥

5

నవ్వుతూ జీవించాలి!-నలుగురినీ నవ్వించాలి!

ఆనందం ఎదలో నింపి-అందరికి అందించాలి!
కష్టాలే కమ్ముకొచ్చినా-నష్టాలేవెంటవచ్చినా
నలుగురికి మేలాశించాలి! నలుగురి మెప్పు సాధించాలి!
వ్యర్థమైన మాటలతో కాలాన్ని వృథాచేయకు!
వ్యథలతోటి చింతలతోటి హృదయాన్ని బరువు చేయకు!
గాలిమేడలేవోకట్టి గగనాన తిరుగులాడకు!
ఈర్ష్యాసూయల సుడిగుండాల్లోపడి మునుగకు!
మిన్ను విరిగి మీదబడ్డా నదురు బెదురు లేకుండాలి!
కన్నుచెదిరే కనకం కన్నా కాంక్షలేవి లేకుండాలి!
కలలోనైనా నీధ్యేయం కనుమరుగుకాకుండాలి!
మనిషిలోని దైవాన్ని అనుక్షణం సేవించాలి!
బ్రతుకంతా బాధలతో భారంగా సాగనీయకు!
ఎనలేని ఆశలతో కోర్కెలు పెంచేయకు!
నీకోసం నీవుగాక నలుగురికై బ్రతకాలి!
పదుగురితో చావో బ్రతుకో పరమార్థం కావాలి !

## విశ్వయోగి సూక్తులు

"ధర్మోరక్షతిరక్షితః" అని తరచు చెబుతుంటారు. ధర్మాన్ని మనం రక్షిస్తే అది మనలను రక్షిస్తుందని అర్థంచెబుతారు. ఈ భావన సరిగాలేదు. ధర్మాన్ని మనం రక్షించడమేమిటి? అదికాదు. ధర్మాన్ని మనం ఆచరిస్తే అది మనలను కాపాడుతుంది అని చెప్పుకోవడం సమంజసం.

* * * *

అన్నిటికంటె సమైక్యత ప్రధానం. వ్యక్తులుగా చేయలేని పనులను సమిష్టిగా చేయగలుగుతాం. ఒక మధ్యతరగతి కుటుంబీకుడు ఏదో సమస్యల్లో మునిగిపోయి, కోటిరూపాయలు ఋణపడ్డాడు. అంత ఋణం తీర్చలేక అతను గుండెపగిలి చస్తాడు. కాని అతనికి కోటిమంది అండగా గనుక ఉంటే ఒక్కొక్కరికి ఎంతపడుతుంది? ఒక్కరూపాయి పడుతుంది. అనేక మంది సమైక్యంగా సమస్యలను ఎదుర్కొంటే ఆవి సమస్యలనిపించవు. సునాయాసంగా వాటిని పరిష్కరించుకోగలుగుతాం.

* * * *

ప్రపంచంలో ఏ మత ప్రవక్త చెప్పినా అది సనాతన ధర్మంలోనిదే! నదులన్నింటికీ ఆధారం సముద్రమే. ఆ సముద్రంలాంటిదే మనసనాతన మతం.

"నేను భగవంతుని దూతను "అన్నాడుమహమ్మద్ ప్రవక్త. ఇది కర్మమార్గం.

"నేను భగవంతుని బిడ్డను" అన్నాడు ఏసుక్రీస్తు. ఇది భక్తి మార్గం.

"నాకూ దేవుడికీ తేడాలేదు. అతడే నేను. నేనే అతడు" అన్నాడు శంకరుడు. ఇది జ్ఞానమార్గం

* * * *

మనం ఎప్పుడూ వ్యతిరేకపుటాలోచనలు చేస్తూ ఉంటాం అన్నిటినీ సందేహిస్తాం. అన్నిటిలోనూ తప్పులే కనిపిస్తుంటాయి. దేవుడువచ్చి ఏదైనా ఇస్తానన్నా పుచ్చుకోం. ఒకరిని గురించి చెడుగా మాట్లాడుకొని ఆనందిస్తుంటాం. ఈ మధ్య ఒక రచయిత్రి నాదగ్గరకు వచ్చి ఇప్పటి మనుష్యుల ప్రవర్తన గురించి ఒక సంగతి చెప్పింది.

"నలుగురు అమ్మలక్కలు ఒకచోట చేరితే ఏమి మాట్లాడుకొంటారు?" అని అడిగాను. "ఎక్కడనో ఉన్న వ్యక్తిని గురించి చెడుగా మాట్లాడుకొంటూ ఆనందిస్తుంటా"రని చెప్పింది. "ఈ నలుగురిలో ఒకరు వెళ్ళిపోతే అప్పుడు ఏమి మాట్లాడుకుంటారు?"అని అడిగాను. "మిగతా వాళ్ళు ఆ వెళ్ళిపోయిన మనిషిని గురించి చెడు చెప్పుకుంటారు" అన్నదామె. ఈలావుంది నేటి పరిస్థితి. ఈ రకమైన ప్రవృత్తిని విడనాడాలి!

* * * *

మనం పండగలను ఎందుకు చేసుకొంటున్నాం? ఎవరింట్లో వాళ్ళు కూచోని బజ్జీలు, బొబ్బట్లు తిని, కడుపునొప్పి తెచ్చుకోవడానికి కాదు. పండుగలను సామూహికంగా చేసుకోవాలి! ఒకరింటికి పదిమందిని ఆహ్వానించాలి! ఒకడు అందరికోసం, అందరూ ప్రతిఒక్కరికోసం జీవించడాన్ని నేర్పడంకొరకు పండగలు ఏర్పడ్డాయి.

* * * *

పూర్వం గ్రామంలో ఒకయింటికి నిప్పుఅంటుకొంటే ఊరుఊరంతా అక్కడికివచ్చి సహాయపడేది. ఇప్పుడు అలాజరగడంలేదు. "అతగల బడే యిల్లు మన పార్టీవాడిదా? ఎక్స్పార్టీవాడిదా?" అని ఆలోచిస్తున్నాం. కుల తత్త్వాన్నిగూడా బాగా పెంచుకుంటున్నాం. కనీసం తమకులస్థుడికి కూడా తాము సహాయపడరు. ద్వేషించడానికే కులతత్త్వంగాని, సహకరించ డానికి కాదనే ఈ పరిస్థితిపోవాలి!

* * * *

రాజకీయప్రయోజనాలకు వీలుగా కులతత్త్వాన్ని పలువురు రెచ్చ గొడుతున్నారు. ఇది విషాదకరమైన పరిణామాలకు దారితీస్తున్నది. అందు చేత కులాన్నిబట్టిగాక, వ్యక్తి యొక్క గుణాన్ని బట్టి ఆదరించడం, గౌర వించడం జరగాలి. మనిషిని మనిషిగా స్వీకరించి అర్థం జేసుకోవాలి. ఇందుకై మఠాధిపతులు గూడా తమతమ ఏకాంతవాసాలను వదలివేసి సమాజంలోనికి రావాలి. ఇపుడు శ్రీ జయేంద్రసరస్వతీ స్వామి లాంటి కొద్దిమంది మాత్రమే ఈ పని చేపట్టారు. దేశంలోని మిగతా పెద్దలుకూడా ఇందుకు సిద్ధంకావాలి. లేనట్లయితే వారు ఏకాకులైపోయి ఉపయోగం లేకుండా ఉండిపోతారు.

శ్రీ శ్రీ శ్రీ